# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి రూపికలు

# శ్రీ పార్థి

ఇందులో

" అపిదళతివజ్రస్య హృదయమ్ "

" కొనుక్కున్న మొగుడు "

అనే మరో రెండు

రూపికలున్నూ వున్నాయి



పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

మొదటికూర్పు ౧౯౬౧

# హెచ్చరిక

## శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి

చిన్నకధలూ,
నవలలూ,
నాటకాలూ,
రూపికలూ,
చరిత్రలూ,
మీగడతరకలూ,
ఖండకావ్యాలూ,
వర్ణచిత్రాలూ,
మెరుపుదెబ్బలూ,
వ్యాఖ్యానాలూ.
ఆత్మచరిత్రా,
వ్యాసాలూ
మొదలయినవి



Printed by Addepally Nageswara Rao
at Saraswathi Power Press
and Published for Addepally & Co., Rajahmundry

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి రూపికలు

## టీ పార్టీ

స్థలం—ఒక మేడ ఉత్తరభాగం.

సమయం—మధ్యాహ్నం మూడు గంటలవేళ.

కింది గది వసారాలో శంకరం అనే యిరవై సంవత్సరాల యువకుడు పైకీ కిందికీ చూస్తూ, చెవులోర చేసుకుని వింటూ వుంటాడు. గళ్లలుంగీ, పల్చని తెల్లలాల్చీ, దానిమీద పొట్టి ట్వీడుకోటూ, నెత్తిమీద గుజరాతీటోపీ, ఫ్రెంచికట్టింగుమీసాలూ, ఆకుచెప్పులూ, కళ్లకి అద్దాలూ, చేతిలో సగం కాలిన బీడీ—ఇదీ అతని వేషం.

సరిగా, యీ వసారా పైని కూడా యిలాంటిదే గది వసారా. అక్కడ, శ్రీదేవమ్మ అనే వొక ప్రౌఢా, సుందరమ్మ అనే వొక యువతీ పిట్టగోడకి చేరబడి నుంచుని వుంటారు. వారిద్దరూ మాట్లాడుకుంటూ వుంటారు. కిందికి ఆమాటలు మాత్రమే వినపడ్తూ వుంటాయి.

హాల్లోనుంచి గదిలోకీ, గదిలోనుంచి శంకరం దగ్గిరికీ శాస్త్రి అనే మిత్రుడు వస్తాడు. వయస్సూ వేషమూ ఇద్దరిదీ వొక్కటే.

శాస్త్రి—(శంకరాన్ని చూసి తెల్లపోయి) ఏమి టీ వాలకం?

శంకరం—(ఏడుపు మొగం పెట్టి) కొంపమునిగింది.

శాస్త్రి—అంటే ?

శంకరం—వినరా. (చిరాగ్గా పైకి చూపిస్తాడు)

పై నుంచి—

శ్రీదేవమ్మ—తెలిసిందా ? ఈనాలుగు మాటలూ చెప్పి మీ అమ్మ వూరుకుంటూరు ఇక నేను చెప్పేది విను.

శాస్త్రి—ఏమిట్రా అదీ ?

శంకరం—(విచారంగానూ, విసుగ్గానూ "వినరా" అన్నట్టు చెయ్యీ తలా వూపుతాడు)

పై నుంచి—

శ్రీదేవమ్మ—మహాజనులారా ! ఇవాళ మిక్కిలీ సుదినం. ఏమంటూరా ? మన మిప్పు డొక చారిత్రికఘట్టంలో వున్నాం. మన వెనకటి తరాలవారు చాలా పౌరుషవంతులు. వారు అనేక మహాయుద్ధాలు చేశారు, గెలిచారు. మహాసామ్రాజ్యాలు నిర్మించారు, దర్జాగా ఏలారుం మనం వారి సంతతివారం, మనకీ కావలసినంత పౌరుషం వుంది, లోటు లేదు. ఇప్పుడూ మనం మహామహా సామ్రాజ్యాలు నిర్మించగలం, చేత కాకపోలేదు. ప్రపంచం తెల్లమొగం వేసేటట్టు ఏలనూగలం, చూసుకోవచ్చు. ఈస్థితిలో యీ రెండో ప్రపంచసంగ్రామం వచ్చింది. ఇది మన జాతికి గొప్ప అవకాశం. ఎంచేతనంటే ? ఇప్పుడు మన యువకు లలో అనేకుల పురుషకారానికి వినియోగం యేర్పడి త్రిలోక ప్రఖ్యాతి రావలసివుంది. అంచేత, నే నీ మహాయుద్ధానికి స్వాగతం నివేదించుకుంటున్నాను. ఇక ప్రకృతం. మన కందరికీ కమ్మని యీ టీపార్టీ ఏర్పాటు చేసిన విశాలాక్షమ్మగారికి సుంద రమ్మ అని వొక్క కూతురు మాత్రమే వుండడమూ, ఆ సుంద రమ్మ స్కూలుఫైనలు పూర్తిచేసి మొన్ననే ఇంటరు జూని యరులో చేరి వుండడమూ, రెండేళ్ల కితమే పెళ్లి అయినా

సంవత్సరం కిందటే ఆమె రజస్వల అయి వుండడమూ మీా రెరుగుదురు.

శా(స్త్రి—ఏమిట్రా యీ గొడవా ?

శంకరం—నా కొంప—

శా(స్త్రి—(పళ్లు కొరుకుతూ విసుగ్గా) సంగ తేమిటో చెప్పరా నాయనా !

శంకరం—నువ్వే ముంచావు తెలుసా ? నీకే తెలుస్తుంది విను.

పై నుంచి—

శ్రీదేవమ్మ—సుందరమ్మ తండ్రి తహాసీలుదారీ వుద్యోగం చేసి, పెన్షను పుచ్చుకుని, ఏణ్ణర్థం కితమే కాలంచేసి వుండడమూ మీా రెరుగుదురు. సుందరమ్మ మామగారు, పోలీసు సర్కిల్ ఇనస్పెక్టరుద్యోగం చేసి మొన్న మొన్ననే పెన్షను పుచ్చుకున్నారు. ఆయన ఏకపుత్రుడు వీరశంకర్రావే సుందరమ్మ భర్త. ఈసంగతు లున్నూ మీాలో కొంద రెరుగుదురు.

శా(స్త్రి—ఈఅట్టుపుట్టాణీ లన్నీ పెల్లగించడం యేమిట్రా ?

శంకరం—(నెత్తి బాదుకుంటాడు)

శా(స్త్రి—ఆమాట్లాడేది నీ పెళ్లాం ట్యూటరు శ్రీదేవమ్మగా రేనా ?

శంకరం—(అవునన్నట్టు ఏడుపు మొగంతో తలవూపుతాడు)

పై నుంచి—

శ్రీదేవమ్మ—శంకరం పోలీసు కొడుకు కనక చాలా పౌరుష వంతు డైనాడు. అందుకు నేను చాలా సంబరపడుతున్నాను. మా సుందరమ్మ చాలా గర్వపడుతోంది. విశాలాక్షమ్మగారు మురిసిపోతున్నారు. మీా రంతా బాగా ఆనందించాలి, తప్పదు.

శా(స్త్రి—ఇప్పు డయినా చెప్పరా.

శంకరం—నా ప్రాణా లెగిరిపోతున్నాయి నే నేమి చెప్పనురా, నువ్వే అర్థంచేసుకోరా.

పై నుంచి—

శ్రీదేవమ్మ—ఆ శంకరం, ఇప్పుడు తన పౌరుషం రేకెత్తగా, అటు నాలుగేళ్లనుంచీ అతిదీక్షగా చదువుతున్న ఇంటరు జూనియరు తరగతీ విడిచి, యిటు కార్యం చేసుకుని తన యింటికి తీసుకువెళ్లవలసిన మా సుందరమ్మనీ విడిచి యుద్ధానికి వెడుతున్నాడు. గుమాస్తాగా అనుకున్నారేమో, కాదు కాదు, సిపాయిగా వెడుతున్నాడు. ఈదివ్యతరుణంలో అతన్ని సత్కరించి పంపడానికే విశాలాక్షమ్మగారీ టీపార్టీ యేర్పాటుచేశారు.

శంకరం—(శాస్త్రికేసి దీనంగా చూస్తూ నెత్తీ నోరూ బాదుకుంటాడు)

శాస్త్రి—ఉండరా పెద్దన్నయ్యా! ఈపుట్టిమునక యేమిట్రా? భయపడి త్వరగా కార్యంచేసేసి పంపేస్తారని మనం అనుకుంటే యుద్ధానికే వెళ్లమని టీపార్టీ యివ్వడమా?

శంకరం—మరేరా నాపాలిటి మందపల్లి శనేశ్వరుడా!

పై నుంచి—

శ్రీదేవమ్మ—నే నీ కసిన్ని మాటలూ చెప్పి వూరుకుంటాను?

సుందరమ్మ—మరి సభవారికి నన్ను పరిచయం చెయ్యరూ?

శ్రీదేవమ్మ-ఇక అదే తరవాయి. అలా తొందరపడిపోతావేం? నీ వుబలాటమే నీదా? నిదానించనక్కరలేదూ? నీమొగుడు మహావీరు డయిపోతున్నందుకు నువ్వు వీరపత్ని వనిపించుకుంటావు నాకు తెలుసు. వీరపత్ని యేమిటి చచ్చుపెద్దమ్మ బిరుదు, వీరయువతీశిరోమణి అనే అనిపించుకుంటావు, తప్పదు. కాని వోపికపట్టాలి.

సుందరమ్మ—మీ కేం చెబుతారు మాట. నా భర్తగారు అలా అయిపోతున్నందుకు నా కెంత ఆవేశం కలుగుతోందో—

శ్రీదేవమ్మ—అయితే, చూసుకో. ఓ రాజమహేంద్రవరపౌర శిఖామణీమణులారా! అల్లుడు యుద్ధానికి వెడుతున్నందుకు మా విశాలాక్షమ్మగారు బెంగపెట్టుకుంటా రనుకున్నాను నేను. తన భర్త, తనని కాక, విజయలక్ష్మిని చేపట్టడానికి వెడుతున్నందుకు మా సుందరమ్మ కూడా చాలా గోలపెట్టేస్తుందనుకున్నాను; కాని నా వూహా తల్లకిందు లయిపోయింది. ఎకాయెకీని బందరుపట్నం నుంచే యుద్ధానికి వెళ్ళిపోకుండా అల్లుణ్ణిక్కడికి రప్పించి, మా విశాలాక్షమ్మగారు వీరఅత్తగారు అనిపించుకున్నారు.

శంకరం—(తెల్లపోయి) నేను బతికివున్నానా, చచ్చిపోయానా?

శాస్త్రి—నాకు తెలిసినంతవరకూ దెయ్యానివై నన్ను పీక్కు-తింటున్నావు.

శంకరం—పైగా యిదా?

శాస్త్రి—నీ తండ్రి నీ గర్భాధానాని కూ—డా నీకు వెయ్యి న్నూటపదహార్లు కట్నమూ, నీ తల్లికీ నీఅక్కా-చెల్లెళ్ళకూ నీకూ లాంఛనాలు కావా లనడమా? మొగదక్షత లేని ఆడది గదా వొప్పేసుకోక నీ అత్తగారు పూతికపుల్ల అయినా యివ్వా నన డమా? సంవత్సరం చూసిచూసి యీ పేచీలు తగ్గిపోయే దారి కనపడక, దాంతో విరహవ్యథాంఖున్నడవై "ఇక భరించలేను. నా సుందరినీ నన్నూ యేకంచెయ్యరా అని నువ్వు నన్ను ప్రార్థించ డమా? పైపెచ్చు, నింద నాకా? బాగుందిరోయ్ వాలకం!

శంకరం—మరి అవుత్తరం మాట?

శాస్త్రి—అవును, వుత్తరాని కేం? మనమే రాశాం.

శంకరం—రాసింది నువ్వు. అబద్ధ మాడకు.

శాస్త్రి—రాయమని కలమూ కాగితమూ యిచ్చి నా కాళ్లు పట్టుకుని దేవుళ్లాడింది నువ్వు, బుకాయించకు

శంకరం—రామా, రామా! (నెత్తి కొట్టుకుంటాడు)

శాస్త్రి—శివశివా, ఆవుత్తరం తడాఖా నీ కేం తెలుసూ? ఇంతకీ:—అలాంటి కుయుక్తులతో వుత్తరం రాయమని నువ్వు తప్ప మరే వాడమ్మ దేవుళ్లాడతాడూ? నేను తప్ప అంత పకడుగా మరే ముసద్దీ రాయగలడూ? కాకపోయినా, నాలుగేళ్లు స్కూలుఫైనలు తప్పి, నాలుగో యేడు ఇంటరు జూనియరు చదువుతున్న వాడవు, నీ కేం తెలుస్తుందీ ఆవుత్తరం బరువు?

శంకరం—అంత బరువయింది కనకనే నా కొంప ముంచిందిరా బాబూ అది.

శాస్త్రి—అది నీకర్మ యెవ రేం చెయ్యగలరురా నాయనమ్మా?

శంకరం—శివశివా?

శాస్త్రి—పోనీ, వొక్క టాలోచించు. ఒక యెత్తు వేశాం. అది నెగ్గే వుంటే? (చూసిచూసి) హె.

పైనుంచి—

శ్రీదేవమ్మ—ఇదిగో, యిక మా సుందరమ్మ మాట్లాడుతుంది సుందరమ్మకి ప్రయివేటు ట్యూటరు నైనందుకు నేను చాలా గర్విస్తున్నాను. ఇంకా మొగ్గగానే వున్న మా సుందరమ్మ సుగుణసౌరభాలు సంతతసాహచర్యంవల్ల నా కొక్కతెకే తెలుసు. ఒకొక్క హైస్కూలుకీ, ఒకొక్క కాలేజీకి సుందరమ్మ వంటి ఒక పిల్ల వుంటే చాలు అక్కడి వాతావరణం అంతా మారిపోతుంది. కనీసం, యివాళ యింగ్లీషు చదువుతున్న యువతులైనా యిలాగ పట్టుదలా శౌర్యమూ కనపరిస్తే మన యువకు లెంతో బాగుపడిపోతారు. విశాలాక్షమ్మగారు మనకి

కమ్మని ఫలహారాలు పెట్టించారు. మా సుందరమ్మ ముద్దుపలుకు లాలకించండి యిక.

శాస్త్రి—నీ పెళ్లాం కూడా వుపన్యాసం పేలగొట్టడమేనా ?

శంకరం—(సగర్వంగా) ఏం, ఇంటరు జూనియరు చదువు తోంది, చేతకాని దనుకున్నావా ? (విచారంగా) కానీ, మొగు డంటే భయభక్తు లుండేటట్టు లేదురా దేవుడా !

పై నుంచి—

శ్రీదేవమ్మ—నువ్వు మాట్లాడతా వని నేను చెప్పగానే, నువ్వు అతిదర్జాగా లేవాలి. సిపాయి వేషం వేసుకుని రైట్, లెఫ్ట్, రైట్, లెఫ్ట్, రైట్, లెఫ్ట్—నీ మొగుడు నడుస్తాడు చూడూ అలాగ నడిచివెళ్లి కమాండరు లాగ టంచెక్‌గా నుంచుని ఉరుముతొన్నట్టు మాట్లాడాలి. దర్జా, గాంభీర్యం, ఆనందం, గర్వం, బింకం, శౌర్యం, వుద్రేకం, పారవశ్యం— యివన్నీ కలిసి నీ చూపుల్లోనూ నీ మాటల్లోనూ యేకధారగా భాసించాలి. అది నీ మొగుడికి గొప్ప గౌరవం.

శాస్త్రి—చచ్చాం, ఇదెక్కడి రిహార్సల్సురా భగవాన్ !

శంకరం—ఆవుత్తరం చదివేస్తుం దేమోరా భగవంతా !

శాస్త్రి—(రోషంగా) చదివితే వ్రూరుకుంటానేం? (నిదానంగా ఆలోచించి) కాదుకాదు, నువ్వూ నీ పెళ్లామూ నీ యిష్టంవచ్చి నట్టు చేసుకోండి, నాకేం ?

శంకరం—(సవిచార రోషంగా) ఏమిటే, నన్ను ముందుకి తోసి ను వ్విప్పు డిలా తప్పుకుంటావా ? ఉత్తరం నువ్వు రాశావు. దస్తూరీ నీదీ. చేవ్రాలూ నీదీ. నాకేం ?

శాస్త్రి—ఒప్పుకున్నాను. ఒప్పేసుకున్నారా. ఆవుత్తరం విన్న వాడు తెలకాయలో మెదడున్నవా డయితే నా ప్రతిభా, నా

చాతుర్యమూ గుర్తించి నాకు సాష్టాంగపడతాడు. నిన్ను మాత్రం—(వొత్తివొత్తి పలుకుతూ టోకాయిస్తూ) చ—ప్పి —పె—ద్ద—మ్మ—కింద కట్టేస్తాడు, తెలుసా ?

శంకరం—శివశివా ! (నెత్తి బాదుకుంటాడు)

పైనుంచి—

సుందరమ్మ—నరనారీమణులారా !

శ్రీదేవమ్మ—నరులూ నారులూ కాకపోతే వచ్చినవారంతా వానరులా యేమిటి ? చప్పగా వుంది మాట. ఆ మొదటి ముక్క వొక్కటీ యింగ్లీషులో అను.

సుందరమ్మ—(బులబులాగ్గా) లేడీస్ ! అండ్ జెంటిల్ మాన్ !

శ్రీదేవమ్మ—భాష మారినంత మాత్రాన లాభంలేదు. బింకంగా కూడా వుండాలి.

సుందరమ్మ—(స్ఫుటంగా) లేడీస్, అండ్ జెంటిల్ మన్ !

శ్రీదేవమ్మ—ఆ, అదీ పద్ధతి అయితే, సభలో అనేటప్పుడు మాత్రం మోర పైకెత్తుకుని మరీ అనాలి. అలా అయితేనే నీ మొగుడి గొప్పతనం నలుగురికీ తెలుస్తుంది. పెళ్లాల దర్జానిబట్టేగా వుద్యోగస్థులు ఉల్లాసంగా వుండి వోహో అనిపించుకోడం ?

సుందరమ్మ—లేడీస్, అండ్ జెంటిల్ మన్ ! మా అమ్మ ఆహ్వానం అంగీకరించి దయతో మీ రందరూ యిక్కడికి వచ్చినందుకు చాలా సంతోషం. మీ కందరికీ నేను కూడా హృదయపూర్వకంగా స్వాగతం నివేదించుకుంటున్నాను. ఇవాళ, నేను ఆనందపరవశ నయిపోయి వున్నాను. అంచేత, నాకు మాటలు సరిగా రాకపోవచ్చు. అందుకు మీ రందరూ నన్ను మన్నించాలి.

శ్రీదేవమ్మ—ఇక విషయం యెత్తుకో.

సుందరమ్మ—మహాజనులారా! ఇవాళ, బ్రాహ్మణయువకులు కూడా యుద్ధాని కనేకమంది వెడుతున్నారు. అయితే, నా రందరూ గుమాస్తాలుగా వెడుతున్నారు. వారిలా కాక నా భర్తగారు సిపాయిగా వెడుతున్నారు. ఇది నాకు పూర్వపుణ్య పరిపాకం. ఇందుకు నేను చాలా గర్విస్తున్నాను.

శంకరం—(సిపాయిలాగ టంచెన్‌గా నుంచుని బింకంగా) ఆ మాట వింటే యుద్ధానికి వెడితేనే మంచి దనిపిస్తోంది.

శాస్త్రి—అలాగటోయ్? తొందరపడకు. మొదపట్టి నీ పెళ్ళాం నిన్ను పడగొంటడానికే పూనుకుంది లే.

శంకరం—(నిట్టూర్పు విడుస్తూ) రామా, రామా!

పైనుంచి—

శ్రీదేవమ్మ—ఇక వుత్తరం సంగతి చెత్తుకో.

శాస్త్రి—(తెల్లపోయి) అనుకున్నంత పనీ జరిగింది.

శంకరం—శివశివా! ఇదిగో, యేడుకొండలవాడా, వెంకటేశ్వరుడా, తండ్రీ, నా పెళ్ళాం ఆవుత్తరం చదవకుండా వుండేటట్టు చేస్తివా—ఇదిగో, నీకు నా తల నీలా లిచ్చుకుంటాను.

శాస్త్రి—వడ్డీకాసులవాడా, నీకు క్రాపింగు పనికివస్తుందా మహాప్రభూ? ఆపిల్ల అది చదివేటట్టు చేస్తివా నీకు నేను వంద కొబ్బరికాయలు కొట్టేస్తాను.

పైనుంచి—

సుందరమ్మ—గుణగ్రహణపారీణులారా, ఏదో వ్యవహారం విషయమై మా అమ్మకి నా మామగారికీ మధ్య కీచులాట జరుగుతోంది. మిలిటరీతత్వం గలవారు కనక, నా భర్తగారు అందు కిష్టపడక, జంధ్యాలు మాత్రం తెంపేసుకోకుండా యుద్ధానికి వెళ్లి

పోతున్నారు. మేము దురదృష్టవంతులం అయితే మాకు తెలియకుండానే వారు రెయి లెక్కేసి వుందురు; కాని ఆయన కొక మిత్రు డున్నాడు. ఆమిత్రుడు ఉత్తరం రాసి మా అమ్మ కా సంగతి తెలియపరిచాడు. అది చాలా గొప్ప వుత్తరం. యూనివర్సిటీలవారు పఠనీయగ్రంథంగా ఏర్పరచవలసిన రచన అది.

శాస్త్రి—చూసుకో నా ప్రజ్ఞ.

పై నుంచి—

సుందరమ్మ—ప్రతికలలో ప్రకటించవలసిన ఉత్తరం అది. చరిత్రలో భద్రపరచవలసిన ఉత్తరం అది

శాస్త్రి—సెబాస్ ! సెబాస్ ! (అంటూ వ్రాగిపోయి) నా ప్రజ్ఞ తెలుసుకోగలది నీ పెళ్లాం వొక్కర్తే. ధన్యోస్మి, ధన్యోస్మి.

పై నుంచి—

సుందరమ్మ—అందులో వున్న సంగతులు నేను నా మాటలతో చెప్పడం ఆవుత్తరాన్ని అగౌరవపరచడమే. కనక, ఆయన రాసింది రాసినట్టుగానే చదువుతాను. మీరు శ్రద్ధగా వినండి

శంకరం—(బిక్కమొగంతో) చదివేస్తోంది రా బాబూ !

శాస్త్రి—అది నా ప్రజ్ఞాధ్వజం, చదివెయ్యవలసిందే రా నా రాజా !

పై నుంచి—

సుందరమ్మ—"విశాలాక్షమ్మగారూ! మీ అల్లు డెంత ప్రతిభావంతుడో అంత పరాక్రమవంతుడు. అతను పుస్తకం పుచ్చుకున్నాడంటే బృహస్పతిని మించుతా డని యిదివరకే పేరు తెచ్చుకున్నాడు. ఇప్పుడు కత్తిపట్టా డంటే—అంటే తుపాకీ లెండి—పరశురాముంవారినీ, ద్రోణాచార్యులవారినీ, కృపాచార్యులవారినీ, అశ్వత్థామనీ, ఖడ్గతిక్కన్ననీ, బ్రహ్మరుద్రయ్యనీ మించి

పోతా డనిపించుకోడానికి యుద్ధానికి వెళ్లిపోతున్నాడు. అతను నాకు ప్రాణస్నేహితుడై నందుకు నేను మిక్కిలీ గర్విస్తున్నాను"

మహాజనులారా, ఆవుత్తరంలో యిదొక భాగం. నా భర్త స్కూలుఫైనలు వరాసగా నాలుగేళ్లు తప్పారంటే అది విద్యాశాఖ డైరక్టరు చేతకానితనం వెల్లడిస్తుంది. ఇప్పుడు ఇంటరు జూనియరు తరగతి నాలుగో సంవత్సరం చదువుతున్నా రంటే అది ఆంధ్రయునివర్సిటీకి మాయనిమచ్చ. వారు పెళ్లిలో కనపరిచిన కొన్ని లీలావిలాసాలను పట్టి నే నిది ఢంకామీద దెబ్బకొట్టి చెప్పగలను. వారి ప్రతిభ యీక్షుద్రసంస్థలకు అతీత మైనది. దాని ఉన్నతశిఖరం అందుకోడం వారి మిత్రునకే సాధ్యపడిేది. ఆమిత్రునివల్ల అసలే మహోన్నత మైన వారి ప్రతిభకి మెరుగు వచ్చింది కాగా, నాభర్తను గురించి అఖర్వగర్వం వారి మిత్రునకే గాదు, నాకూ కూలంకషంగానే వుంది. ఇందుకు మీ రామోదించినట్టు స్పష్టంగా వెల్లడిస్తా రని ఆశిస్తున్నాను.

శ్రీదేవమ్మ—సరిగా ను ప్వీమాట అనేటప్పటికి, మన యేర్పాటు ప్రకారం సభలో చెదిరిచెదిరి కూచునివున్న మనవాళ్లు, ఏకగ్రీవంగా "హోహో, హోహోహో" అంటూ సింహనాదాలు చేస్తారు. ఒక పక్కగా కూచునివున్న నీ సహాధ్యాయినులు అది శుకానువాదం చేస్తారు చివరి కందరూ కలిసి దిక్కుహారాలు ముఖరితా లయేట్టు—యుద్ధరంగంలో నీ మొగుడి తుపాకి పేల్పులకు సూచనలున్నా అయేట్టు కరతాళధ్వనులు చేస్తారు.

శాస్త్రి—ఇది కూడానా? గుండెలు తీసిన బంటులా వుండే యీటూ్యటరు!

శంకరం—ఈటూ్యటరుబడవ నా పెళ్లాన్ని తప్పుదారిలో పెట్టి నా కొంప ముంచేస్తోందిరా బాబూ!

పై నుంచి—

సుందరమ్మ—ఇంకో భాగం చదువుతున్నాను, వినండి. విశాలాక్షమ్మగారూ! మీ అల్లుడు నాకు ప్రాణస్నేహితుడు. అతని విలువ నాకు తెలిసినట్టు మరెవరికీ తెలవదు. యుద్ధానికి వెడితే స్వల్పకాలంలోనే అతను కమాండరయిపోతాడు, సందేహం లేదు; కాని యుద్ధం పూర్తి అయేదాకా—అంటే—అయిదారేళ్లమాట—ఈలోపున మన కంటపడడు. ఇందుకు నేను చాలా చాలా విచారిస్తున్నాను"

మహాజనులారా! దీని కేమి చెప్పడమో నాకు తోచడం లేదు. ఎంచేతనంటే? అలాంటి వీరాధివీరులు నా భర్తగారు ఇలాంటి పిరికిపందతో ఎలా స్నేహంగా వుంటున్నారో నాకు అర్థం కావడం లేదు. నిజంగా, నే నిందుకు చాలా సిగ్గుపడిపోతున్నాను. అయిదారు కాదు, పదిపదిహేనూ కాదు, చివరికి పాతికేళ్లు వారు నా కింటపడకపోయినా నే నెంతమాత్రమూ విచారించను. నాభర్త గొప్పవారయిపోవాలి, నా క్కావలిసిందంతే. ఇక్కడ వుంటే రెండు పూట్లా భోజనం చెయ్యడమూ, రెండుపూట్లా టిఫిన్ మెక్కి కాఫీ టీలు తాగడమూ, బీడీలు కాలుస్తూ బజారులో పడి తిరగడమూ—ఇంతే కాదూ సౌభాగ్యం? గ్రీష్మభానుడు ఒకప్పుడు మేఘమండలంలో తిరస్కృతు డయివుంటాడు, లోకేం? తరవాత, తనప్రచండప్రతాపం చూపించడూ? అలాగే సర్వీసు పూర్తి అయేదాకా, నా భర్త నాకు కనపడకపోయినా నేను విచారించను. చివరి కాయన సురక్షితంగా యింటికి వస్తారు, నాకు తెలుసు. పొందవలసిన ఉన్నతీ, కూర్చుకోవలసిన ఘనతా, సంపాదించుకోవలసిన కీర్తీ, ఆర్జించుకోవలసిన సంపదా పూర్తి అయినాకే వారు నాకు దర్శనం యిస్తే,

నా కంతకంటే కావలసిన దేమి వుంటుందీ ? కనక, మీ రందరూ కలిసి ఆమిత్రుణ్ణి నానాచివాట్లూ పెడుతూ నిరసనతీర్మానం చేసి యీసభలోనే ఆయన కందచేస్తా రని నమ్ముతూ ఎదురు చూస్తున్నాను.

శాస్త్రి—(తెల్లపోయి) ఆ,ఆ !

శంకరం—జరగవలసిందే నీ కీ మర్యాద.

శాస్త్రి—అలాగేం ? అయితే, అసలు మర్యాద యెవరికో !

శంకరం—(నెత్తి కొట్టుకుంటాడు)

పై నుంచి—

సుందరమ్మ—మహాజనులారా, ఆమిత్రు డింతటితో వూరు కుంటే బాగుండిపోను; కాని యింకా యెంత అవకతవకరాత రాశాడో చూడండి.

శాస్త్రి—ఆ, అవకతవకరాతా ?

శంకరం—శకునపక్షిరాత అని కూడా అనవలసిందే.

పై నుంచి—

సుందరమ్మ—"విశాలాక్షమ్మగారూ ! మనలో మన మాటం ంచి మే లెంచమన్నాడు. యుద్ధం జరుగుతున్నంతకాలమూ యూరపులో తిరుగుతాడు కనక, మీ అల్లుడు, మిమ్మల్ని, మీ అమ్మాయినీ, తల్లిదండ్రులనూ, ముఖ్యంగా అతన్నే నమ్ము కుని వున్న ప్రాణమిత్రుణ్ణి నన్నూ మరిచిపోయి, యే దొరసాని పిల్ల నయినా పెళ్ళాడేసి అక్కడే వుండిపోతా డేమో అని నాకు చాలా అనుమానంగా వుంది సుమండీ"

నరనారీమణులారా, చూశారా యీ మిత్రు డెంత సంకు చితహృదయుడో ? నిజంగా, నా భర్తగారి యీ కుత్సిత మిత్రుణ్ణి నేను తీవ్రంగా నిరసిస్తున్నాను. తీక్ష్ణంగా గర్హిస్తున్నాను.

నా భర్తగారు నన్ను మరిచిపోతారుట. ఏమిటో యిందులో వున్న విశేషం ? అసలు, తనసే మరిచిపోతే గాని యెవడూ యుద్ధరంగంలో వురకలేడు. కాకపోయినా, నా భర్త దొరసాని పిల్లని కాదు, దొరసాన్నే పెళ్లాడతా రనుకోండి ప్రపంచం తల్లకిందు లయిపోతుందా? బహుభార్యాత్వం మనలో తప్పు కాదుగా? మన ఆధ్యాత్మికోన్నతి కది గుర్తున్నా కదా ? ఇంతకీ: మనవాళ్లెంత గొప్పవాళ్లయినా, సర్కారు కొన్ని వుద్యోగా లివ్వరు. మరి నా భర్త దొరసాన్ని పెళ్లాడితే ఆదోషం పోతుందిగా ? ఆదొరసాని వైభవాలు తీర్చడాని కయినా సర్కారు నాభర్తకి గొప్ప వుద్యోగం యివ్వాలిగా ? ఇది నాకు ఘనత కాదూ ? నాభర్త సర్కిల్ ఇన్‌స్పెక్టరు కాదు కనిపించుకోడం కంటే గొప్ప మిలిటరీ ఆఫీస రనిపించుకోడం నాకు ఆనందకరం కాదూ? నాభర్త దొరసానులను కూడా మోహింపచేసే టంతటి అందగాడు కావడం నాకు గర్వకారణం కాదూ ? కాగా, మహామహు లయిపోయే నా భర్తగారి ముందరికాళ్ల కిలాగ బంధాలు వేసే యీ మిత్రుడు గుంటనక్క అంటారా, మనిషి అంటారా?

శంకరం—కావలసిందే.

శాస్త్రి—మరి ఆగుంటనక్క పాదా లాశ్రయించిన అభాగ్యు ణ్నేమంటారో ?

శంకరం—రామా !

పైనుంచి—

సుందరమ్మ—సభాసదులారా ! ఇంతవరకూ రాసిన రాతలన్నీ మనం సహించవచ్చు; కాని ఆమిత్రు డింతటితో ఆగలేదు.

"కనక—విశాలాక్షమ్మగారూ ! పిలవని పేరంటం అయినా, మీ కిప్పు డొక సలహా చెప్పడానికి నేను సాహసిస్తున్నాను.

వారంరోజులు రాత్రింబగిళ్లు ఏకటాకీని ఆలోచించి సిగ్గు తేల్చిన సలహా యిది. కనక, మీరిది బాగా ఆలోచించాలి. ఏమిటంటే? కట్నాలూ లాంఛనాలూ యిస్తే గాని కార్యం చేసుకుని మీ అమ్మాయిని తీసుకువెళ్ల నని మీ వియ్యంకుడుగారు పేచీ పెట్టుకూర్చున్నారు గదా ? పెళ్లికే కట్నా లడగడం తప్పయి వుండగా, కార్యాని కూడా యివ్వా లని ఆయన యేమొగం పెట్టుకుని అడుగుతున్నాడో నాకు బోధపడకుండా వుంది. ఆయన చిత్తవృత్తి యింత నికృష్ట మైన దని మా కెప్పుడూ తోచలేదు. ఈవిషయం తలుచుకుని తలుచుకుని మీఅల్లుడు చాలా సిగ్గు పడిపోతున్నాడు. నిజంగా, మా మిత్రమండలిలో అతను తల యెత్తుకుని తిరగలేకుండా వున్నాడు. ఈయుద్ధప్రస్థానమే తటస్థించి వుండకపోతే అతను ఏ కాశీ అయినా పారిపోయివుండు నంటే మీరు అకురాలా నమ్మవలసిందే. ఎప్పుడూ యిలాంటి తుచ్ఛోపాయాలే అవలంబించే మీ వియ్యంకుడుగారి మాట యే మయినా, మీ అల్లుడు సత్పురుషుడు కావడం చాలా గొప్ప సంగతి. ఏతావతా: మీకు నే నిప్పుడు రాసే దేమిటంటే? మీ రంగీకరిస్తారా నేను మీ అల్లుణ్ణి రాజమండ్రీ తీసుకువస్తాను. "యుద్ధానికి వెళ్లేటప్పుడు అత్తగారి దీవనలు పొందడం చాలా శ్రేయస్కరం" అని చెప్పి మభ్యపెట్టి మీ అల్లుణ్ణి మీ యింటికి తీసుకువస్తాను. వెంటనే మీరు గప్ చిప్ గా కార్యం చేసెయ్యండి. మీ వియ్యంకుడు తరవాత మిమ్మ ల్నేమీ చెయ్యలేరు. కుడి చేతా యెడమచేతా ఆయన సంపాదించి పోగులుపెట్టిన లక్షలు అనుభవించవలసినవాడు మీ అల్లుడొక్కడే. అక్కడి నయినా, మీ ఆస్తి అంతా మీ అమ్మాయికి భుక్తపడేదే గదా ? ఇక లోటేమిటి ? మీ అల్లుడికి, పెద్దచదువులు చదివి నౌకరీ

చెయ్యవలసిన అగత్యం యేమి వుందీ ? ఇలా చేస్తే మీ కేమీ యిబ్బంది వుండదు. దీంతో, మీ కల్లుకు, ఇక యుద్ధానికే కాదు, బందరు మొగం కూడా చూడదు. రాజమండ్రీలో, మీ యింటో, మీ సన్నిధినే వుడిపోతాడు, నాదీ పూచీ.

శాస్త్రి—ఆహా ! కనిపెట్టే నాథుడు లేకపోయాడు గాని యేమి పాయింట్లు వేశావు రా నా రాజా !

శంకరం—అసలు, యీసలహా అన్నాతా నేను చెప్పి దగ్గిర వుండి వుత్తరం రాయిస్తే, నువ్వేదో వారగదోసినట్టు గప్పాలు కొడతా వేమిట్రా పప్పూ ?

శాస్త్రి—కనక, ఆబహుమానాలు కూడా నువ్వే అందుకోరా జజ్జూ

శంకరం—(ఉలిక్కిపడి) అయ్యో ! (అంటూ నెత్తికొట్టుకుంటాడు)

పైనుంచి—

సుందరమ్మ—మహాజనులారా ! ఈయువకుడు నా భర్తగారి ప్రాణస్నేహితుణ్ణని చెప్పుకుంటున్నాడు; కాని ఆయన కాళ్లకిందే గోతులు తవ్వుతున్నాడు—

శ్రీదేవమ్మ—ఆవేశం చాలదు. మాటలు చాప్పగా వున్నాయి, ఉద్రేకం తెచ్చుకో.

సుందరమ్మ—మహాజనులారా, ఈయువకుడు నా భర్తగారి ప్రాణస్నేహితుణ్ణని చెప్పుకుంటున్నాడు; కాని ఆయన కాళ్లకిందే గోతులు తవ్వుతున్నాడు, చిత్తగించండి. దగా చెయ్యమని మా అమ్మను ప్రోత్సాహపరుస్తున్నాడు, పరకాయించండి. సిగ్గూబిడియమూ విడిచి మా మామగారు లాగుదా మనుకుంటున్న డబ్బు పడగొడుతున్నాడు, గుర్తించండి. ముఖ్యంగా,

నన్ను, మురికిగుంటలో పడగొట్టాలని ఉచ్చులు పన్ను తున్నాడు—

శంకరం—(కొరకొర చూస్తూ పళ్లు పటపట్లాడిస్తూ) నిజం నిజం.

పై నుంచి—

సుందరమ్మ—నా భర్తని చచ్చుపెద్దమ్మని చేసి—

శాస్త్రి—నిజం నిజం. (పెదవులు బిగించుకుని, గుడ్లురుముతూ వెటకారంగా తల యెగరవేసుకుంటాడు)

శంకరం—శివశివా !

పై నుంచి—

శ్రీదేవమ్మ—ఇంకా వుద్రేకం కనపరచాలి.

సుందరమ్మ—సభాసదులారా ! ఈమిత్రుడు నా భర్తని చచ్చుపెద్దమ్మని చేసి ఆడిస్తున్నాడు. ఇది నేరంచేయించడానికి కుమ్మక్కు. నీచమైన కుట్ర. దారుణమైన ద్రోహం. మన వాళ్లలో వున్న నైచ్యం అంతా యీ మిత్రునిలో మూర్తీభవించింది. మన వాళ్లలో వున్న దుశ్చింత అంతా ఈస్నేహితునిలో అచ్చుకట్టి వుంది. మనవాళ్లలో వున్న పశుప్రవృత్తి అంతా యీ సహచరునిలో రూపొంది వుంది.

శంకరం—ఇంకా వాయించు.

శాస్త్రి—చివరికి ముక్తాయింపుంటుంది, తొందరపడకోయ్ నాయనమ్మా !

పై నుంచి—

శ్రీదేవమ్మ—చిల్లపెంకు. గుడ్డిగవ్వ. గడ్డిపరక. చచ్చిన పాము. ఆయుకుణ్ణి విడిచిపెట్టెయ్యి. ఇక నీ భర్త సంగతి యెత్తుకో.

శాస్త్రి—(వికటంగా చేతులు తిప్పుతూ శంకరంతో) మరి చూసుకో ఇక కాసుకో

శంకరం—నా పెళ్లాంచేత నన్ను తిట్టిస్తావా ?

శాస్త్రి—నీ పెళ్లాంచేత నన్ను తిట్టిస్తావా నువ్వు ?

శంకరం—కుట్రపన్నినందుకు అనుభవించు.

శాస్త్రి—కుట్రపన్నమని దేవురించినందుకు నువ్వు ఘోరించు.

శంకరం—ఇక నీ యిష్టంవచ్చినట్టు గింజుకో. నేను వెళ్లి మీటింగు జరిగించవద్దని ఏకాంతంగా శ్రీదేవమ్మగారి కాళ్లు పట్టుకుంటాను. మేము ముగ్గురమూ వొకటయిపోతాం.

శాస్త్రి—నేను వెళ్లి సంగతంతా మీ నాన్నకి చెప్పేస్తాను. క్షణంలో నిన్నాయన అరెస్టు చేయిస్తాడు. మే మిద్దరమూ వొకటయిపోతాం.

శంకరం—తరవాత యే మయితే కానీ, ముందు కార్యం అయిపోతుంది కదా ?

శాస్త్రి—గుర్రండిగు. నువ్వు పీటలమీద కూచునేటప్పటికే అరదండాలు పట్టుకు చక్కా వస్తారు పోలీసులు.

శంకరం—రామా, రామా !

పై నుంచి—

సుందరమ్మ—మహాజనులారా ! ఈ నీచుడి సంగతి యిలా వుండనివ్వండి. ఈకుట్రలో నా భర్త చేరివున్నట్టా లేనట్టా ? ఇదీ తేల్చుకోవలసింది.

శాస్త్రి—వ న్నేమన్నా సరే, ముందా సంగతి తేల్చుకో

పై నుంచి—

సుందరమ్మ—నరనారీమణులారా ! ఈస్నేహితుని విషయం తెలుసుకుంటే నాకు వొళ్లు మండిపోతోంది అంతే, యిప్పుడు నా శరీరంలో రోగాగ్ని ప్రజ్వరిల్లిపోతోంది దాంతో, బుద్ధి విశదమై నాకు ఆగతానాగతవిషయాలు తేటతెల్లంగా గోచరిం చేస్తున్నాయి. నిజం యేమిటంటే ? జరిగిందిన్నీ యేమిటంటే ? ఇలాంటి కుయుక్తులతో యీ వుత్తరం నా భర్తే రాయించారు.

శంకరం—కనిపెట్టేసిందిరా దేవుడా ! (చేతులతో మొగం కప్పుకుంటాడు)

శా(స్త్రి)—నిజం నిలకడమీాద తేలిపోయిందిగా నా రంగా !

పై నుంచి—

సుందరమ్మ—ఇక్కడ వున్న రహాస్యం యేమిటంటే? తండ్రి ఆమెత్తు వేస్తే కొడుకు ఈమెత్తు వేశాడు. బుద్ధిలేక యీ మిత్రుడు నిమిత్తమాత్రుడైనాడు. కూలికి విషం తాగాడు; కాని దీని కంతకీ మూలం అక్షరాలా నా భర్త.

(శ్రీ)దేవమ్మ—ఉద్రేకం చాలదు.

సుందరమ్మ—మహాజనులారా ! నే నీ కుట్ర సహించను. నే నిక ఆమానవుని మొగం చూడను. ఆనడపీనుగు పెళ్లాన్నయి పడివుండను.

(శ్రీ)దేవమ్మ—ఇంకా వుద్రేకం కనబరచాలి,

సుందరమ్మ—ఇలాంటి యువకులు పుట్టేం, పుట్టకే ? ఇలాంటి యువకులు చచ్చేం బతికేం ?

(శ్రీ)దేవమ్మ—చప్పబడిపోతున్నావు.

సుందరమ్మ—లేదు. నే నెంతమాత్రమూ వొప్పుకోను. వ్యవహారం యింతవరకూ వచ్చాక, యుద్ధానికి వెళ్లవలసింది నా భర్త

కాదు, నేను. సర్కారుకి టెంతికొట్టేసి ఇవాళ మెయిల్లోనే నేను ఢిల్లీ వెళ్లిపోతాను. అయితే, హిందూదాంపత్యం విచ్ఛిన్నం కాదు. మన ఆధ్యాత్మికజాతిలో స్త్రీకి భర్త గాక మరి గతి లేదు. కనక, నేను యుద్ధానికి వెళ్లినా భర్తని విడిచిపెట్టను. అయితే, నేను తిరిగి వచ్చేటప్పటికి, ఆయన, కమ్మగా వంట చెయ్యడమూ, చక్కగా శిశువులను పెంచడమూ, పొదుపుగా గృహకృత్యాలు నిర్వహించడమూ నేర్చుకునివుంటే నే నాయన్ని దయతో ఏలుకుంటాను.

శాస్త్రి—వన్సుమోర్ !

శంకరం—ఇక నే నాగలేను ఇదిగో, వెళ్లి నేను గోదావరిలో పడిపోతున్నాను.

శాస్త్రి—(శంకరం చెయ్యిపట్టుకుని) ఆగు. టీపార్టీ అనే మాట చెవిని పడేటప్పటికి నోరూరి చప్పబడిపోయింది కనక, క్షణంలో కాఫీహోటలుకి వెళ్లి వేడివేడి టీ పుచ్చుకు చక్కావస్తాను. అంతవరకూ నువ్వు మునుగుతూ తేల్తూ వుంటివా, నేను వచ్చి ఒడ్డుకి లాగిపారేస్తాను. టీపార్టీ మాట జ్ఞాపకం వుంచుకుని, కాఫీ అనుకుని, కొత్తగోదావరి నీళ్లు మాత్రం నాలుగు గుక్కలు పీల్చెయ్యకేం. మరి వెళ్లు. పరుగు.

శంకరం హాలుకేసి వెళ్లిపోతాడు. "బుద్ధిహీనుడా, వద్దురా, లోకువయిపోతావురా" అంటే మానావా? అనుభవించు" అంటూ శాస్త్రి మెల్లిగా వెనకాల బయలుదేరతాడు.

౧౯౨౭. ఆగష్టు ఆంధ్రశిల్పి
(సవరణలతో)

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి రూపికలు

# "అపిదళతి వజ్రస్యహృదయమ్"

## మొదటి రంగం

స్థలం—జోగన్న మేడమీది హాలు.

సమయం—మధ్యాహ్నం కాఫీ లయినాక.

జానకమ్మా జోగన్నా యెదురెదురుగా కూచుని వుంటారు. తమలపాకులు సిద్ధంచేసి తాను వేసుకుంటూ జోగన్న కిస్తూవుంటుంది జానకమ్మ.

జోనకమ్మ—బాగా ఆలోచించుకోండి.

జోగన్న—నాకే గాని నీ కక్కర లేదా యేమిటి ఆలోచన?

జానకమ్మ—కాని కాలం వచ్చి పడింది. మూడేళ్లయి సమర్తాడిన కోడల్ని పుట్టింట అట్టేపెట్టేసి వూరుకోడం మంచిది కాదు. అపవాదు పుట్టిం దంటే మాపుకోలేము సుమండీ!

జోగన్న—అవతల తల్లికీ తండ్రికీ లేనిబాధ మనకేం?

జానకమ్మ—మనం మాత్రం తల్లితండ్రులం కామూ ఇవతలా?

జోగన్న—అయితే?

జానకమ్మ—మన కోడలు—

జోగన్న—అదే వద్దు. కార్యం అయి మన యింటికి వచ్చేదాకా కోడ లంటే యేమన్న మాటా? ఇప్పుడు మన కేమీ పూచీ లేదు, చల్లచల్లగా వూరుకో.

జానకమ్మ—వద్దుసుమండీ, తనువులు శాశ్వతాలు కావు.

జోగన్న—నిజమే.

జానకమ్మ—మాట కలకాలమూ వుండిపోతుంది.

జోగన్న—అదీ నిజమే.

జానకమ్మ—(చకితఅయి) ఇంకేం చెప్పగలనమ్మా నేనూ ?

జోగన్న—నువ్వు చెప్పగలగడానికి సందంటూ వుండనిస్తే కాదుటయ్యా నేనూ ?

జానకమ్మ—(చూస్తూ వూరుకుంటుంది)

జోగన్న—హు ! దొడదొడ మాట్లాడగానే సరా ? పాయుంటుండాలి నోరు విప్పితే.

జానకమ్మ—ఇంకా చెప్పుకోవాలి తగుదునమ్మా అని.

జోగన్న—ఏమి లోటు వచ్చిందీ ?

జానకమ్మ—నలుగురూ యేమనుకుంటున్నారో ?

జోగన్న—అనాథనయి నేను వియ్యాలవారికి లొంగిపోతే అప్పు డేమనుకుంటారో ఆనలుగురూ ?

జానకమ్మ—ఇదేం అభిమానం మామ్మా ?

జోగన్న—నువ్వందుకోలేనంత ఉన్నత మైన దిది.

జానకమ్మ—నా కక్కర్లేదు. మీరే అందుకుని, మీరే అట్టే పెట్టుకోండి అంతా.

జోగన్న—కావా లంటే మాత్రం నీకు వాటా పెడతానా ?

జానకమ్మ—పోనీ, నోళ్లలో పడండి.

జోగన్న—నువ్వే పడేశావు నన్ను, ఇంక పడ్డాని కేమి వుంది కొత్తగా ?

జానకమ్మ—చూశారా ?

జోగన్న—విన్నారా ?

జానకమ్మ—(చూస్తూ వూరుకుంటుంది)

జోగన్న—ఏం, మాట్లాడవేం ?

జానకమ్మ—రెండో కొడుకు పెళ్లాంతో కాపరం చేసుకుంటూ వుండడమూ, అన్నీ వుండీ కూడా పెద్దకొడుకు ఘోటకబ్రహ్మ చారి లాగ—

జోగన్న—వాళ్లకి మాత్రం లేమా ఆలోటూ ? రెండో కూతురు లక్షణంగా కాపరం చేసుకుంటూ వుండడమూ, పెద్ద కూతురు మొగుడు విడిచిపెట్టేసిన దాని లాగ—

జానకమ్మ—చాల్చాలు, వూరుకోం డిపాటికి నేర్చుకుపోయారు.

జోగన్న—నే నూరుకునే వున్నాను నువ్వే కదిపావు తుట్ట.

జాకకమ్మ—బుద్ధి లేకా.

జోగన్న—ఇంకా సందేహామా ? పెత్తనం చేదా మన్న వుబలాటమేగాని లాభనష్టా లేం తెలుసునూ నీకూ ?

జానకమ్మ—నాకు సంసారమే తెలుసు గాని లాభనష్టా లేమీా తెలియవు సుమండీ, నిజమే.

జోగన్న—భారతభాగవతాలికి అర్థం కూడా చెబుతావు మళ్లీ; కాని వోనమాలు రాని వియ్యాపురాలు నయం నీకంటే.

జానకమ్మ—ఏమిటో ఆనయం ?

జోగన్న—అలా అడిగావు బాగుంది. చెబుతాను వినుమరి. ఈపట్టుదల అంతా రాజమ్మ దంటున్నారు; గాని సుందరప్ప దన డంలే దెవరూను,

జానకమ్మ—అయితే ?

జోగన్న—వాడు నిర్భయంగానే తల యెత్తుకు తిరుగు తున్నాడు వీధిలో.

జానకమ్మ—తిరిగితే ?

జోగన్న—తిరిగితే యేమిటని వొక ప్రశ్నా ? ఆడది యింటో వుండిపోయిందికనక, వీధిలో యెవళ్లేమనుకున్నా లెక్కలేదు. మొగాడు వీధిలోకి వెడతాడు కనక, భారం అంతా తన నెత్తి మీద వేసుకుంటే——

జానకమ్మ—బాగుంది ఆలోచన. మంచిమాటే. ఇప్పటికే ఆడాళ్లంతా నన్ను పీకేస్తున్నారు.

జోగన్న—నిన్ను పీకేస్తున్న ఆడాళ్లు రాజమ్మ దగ్గర నోరెత్తరేం ? ఈమాట వాళ్ల నడగలేవూ నువ్వు ?

జానకమ్మ—మీరు చూశారా ?

జోగన్న—మరి మన కిచ్చెయ్యవలసింది యివ్వదేం ?

జానకమ్మ—మొండికెత్తినవాళ్ల నెవళ్లేం చెయ్యగలరూ ?

జోగన్న—అయితే, నువ్వు బండకెత్తు.

జానకమ్మ—సడసంగానే వుంది (ఈసడింపుగా చేతు లాడించు కుంటుంది)

జోగన్న—(చూస్తూ వూరుకుంటాడు)

జానకమ్మ—అయితే, యిక నా మాట వినరూ ?

జోగన్న—నువ్వు చెప్పిం దేదీ ?

జానకమ్మ—అయితే వినండి. మనకి కట్నాలూ వద్దు, కానుకలూ వద్దు. అబ్బాయి పెద్ద చదువులు చదివాడు. నెలకి నూంట

యాభై రూపాయీలు తెచ్చుకుంటున్నాడు. పైగా, మనం వాళ్లకి పెట్టగలవాళ్లం గాని ప్రాధేయపడి వాళ్ల దగ్గిర తెచ్చుకోవలసినవాళ్లం కాము.

జోగన్న—(తల వూపుతూ ఇంకా అన్నట్టు చూస్తాడు)

జానకమ్మ—తెలిసిందా ?

జోగన్న—ఇంతవరకూ చెప్పిందంతా నాకూ తెలిసిందే. ఇక తరవాయి యేమిటో తేల్చెయ్యి తొరగా.

జానకమ్మ—కనక, మన కేమీ వద్దు. పిల్లని తీసుకువచ్చి కార్యం చేసేసి చెన్నాపట్టం పంపెయ్యండి.

జోగన్న—అఘోరించిన ట్టుంది నీ సలహా.

జానకమ్మ—(తెల్లబోతుంది)

జోగన్న—మొగుణ్ణి వీధిలో పెట్టిన గద్దమ్మవు నిన్ను సలహా అడగడం యేమిటి నేను ?

జానకమ్మ—అయితే, పరువుప్రతిష్ఠలకు నీళ్లు వదులుకున్నట్టేనా ?

జోగన్న—పట్టుదల నెగ్గించుకోలేని వాళ్లకి పరువంటే యేమిటి, ప్రతిష్ఠ యెక్కణ్ణుంచి వస్తుంది ?

జానకమ్మ—వియ్యపురాలితో సమం అవుతారా ?

జోగన్న—వియ్యపురాలికి లొంగి పడివుండ మంటావా ?

జానకమ్మ—ఇంకా యిద్దరు మొగపిల్లలకూ, ఇద్దరు ఆడపిల్లలకూ పెళ్లిళ్లూ పేరంటాలూ చేసుకోవాలి, ఇలా అయితే వాళ్లకి మంచి సంబంధాలు తేగలమా ?

జోగన్న—పెద్దబ్బాయికి స్థిరపడ్డ కట్నమూ, కానుకలూ వదులుకుని తెల్లమొగం వేస్తే, తరవాత, మూడోవాడికీ నాలుగోవాడికీ కట్నాలు పలుకుతాయా ?

జానకమ్మ—ముందు చేతిలో పోయించుకునే తరలివెడదాం.

జోగన్న—మూడు ముళ్లూ పడితే గాని యివ్వమని వాళ్లనలేరు, నువ్వే మహా గడుసుదానవు, కదూ ?

జానకమ్మ—(చూసిచూసి) కాకపోయినా, వీధికి వెళ్లే మొగ మనిషికి పట్టూ విడుపూ వుండాలి. ఆడదానికంటే కనిక్షం అయితే యింకేమిటీ చెయ్యడం ?

జోగన్న—(చూస్తూ వూరుకుంటాడు)

జానకమ్మ—మూడేళ్లనుంచీ వసూలు చెయ్యలేకపోయారు, ఇక చేస్తారు మహా.

జోగన్న—(చూస్తూ వూరుకుంటాడు)

జానకమ్మ—నాలుగ్గోడల మధ్యా పడి వుండి నేను గోల పెట్ట వలసిందే కాని యేవ్యవహారం సరిగా నిర్వహించుకో గలిగారు మీరు ?

జోగన్న—(చూస్తూ వూరుకుంటాడు)

జానకమ్మ—కాపరానికి వచ్చినప్పట్నుంచీ చూస్తాను, చీట్లా టలో వున్న శ్రద్ధ మరి దేల్లోనూ లేదు. తండ్రి తద్దినం నా డయినా పన్నెండయినాకే దర్శనం.

జోగన్న—(చూస్తూ వూరుకుంటాడు)

జానకమ్మ—మాట్లాడక నన్నేం వుద్ధరిస్తారా ?

జోగన్న—(చూస్తూ వూరుకుంటాడు)

జానకమ్మ—నా దగ్గిర కోతలు కొయ్యడం కాదు, ప్రయోజ కత్వం, మీకు తగ్గ వియ్యపురాలు దొరికింది అనుభవించండి.

జోగన్న—(చూస్తూ వూరుకుంటాడు)

జానకమ్మ—తల్లి పెంకితనాని కక్కడ అదెంత అటమపిస్తోందో, మీ పట్టుదల కెక్కడ అబ్బాయి యేమి రుసరుసలాడుతున్నాడో—పోనీ, నాకేం ?

జోగన్న—మరి యీ రభస మాత్రం యెందుకూ ?

జానకమ్మ—మీ యిష్టం వచ్చినట్టు చేసుకోండి. మీదగ్గిర యిక యీ వూసు తెస్తే ఛీ అనండి నన్ను.

జోగన్న—రక్షించావు. మాటిమాటికీ నన్ను చికాకు పెట్టక యిక ఆమాటమీద వుండు.

జానకమ్మ చురచుర చూస్తుంది. జోగన్న వెళ్లిపోతాడు.

---

## రెండో రంగం

స్థల—ముందువాకి ఉత్తరపు గది.

సమయం—ఉదయం, తొమ్మిది ముప్పావు.

కొడుకు గోపాలశర్మ పెట్టె సద్దుకుంటూ వుండగా,
తాంబూలం వేసుకుంటూ జోగన్న వస్తాడు.

జోగన్న—వొరే, గోపాలం ! నువ్వూ మీ అమ్మా కలిసి దీక్షితుల్ని రాయబారం పంపారుటా ?

గోపాలశర్మ—అవును నాన్నారూ !

జోగన్న—అవునూ ? ఏమిటీ ? ఇక నా లెక్కాపత్రమూ లేదన్నమాట. ఇంటికి నువ్వే యజమాని వయిపోతూ వన్న మాట.

గోపాలశర్మ—మీ రిలా అంటూ రనుకో లేదు నాన్నారూ !

జోగన్న—మరేమంటూ ననుకున్నావూ ?

గోపాలశర్మ—అలా అయితే, అసలు, నా కిల్లేదీ ?

జోగన్న—అది తెలుసు గదా ? ఈమేడ నా స్వార్జితం.

గోపాలశర్మ—అవును, తెలుసు.

జోగన్న—మనకి పిత్ర్యం రెండున్నర యకరాలే వుంది. అందులో అయిదోవంతు మాత్రమే నీదీ. తక్కిన నలభై యకరాలూ కూడా నా స్వార్జితం. ఇది కూడా తెలుసా ?

గోపాలశర్మ—తెలుసు.

జోగన్న—మరి యింకేం చూసుకునీ నీ భరవసా ?

గోపాలశర్మ—నా రెక్కలు చూసుకునీ. ఈశ్వరుణ్ణి నమ్ముకునీ.

జోగన్న—హాహ్హా ! రెక్కలు ట రెక్కలు. ఎవ రిచ్చారుట ?

గోపాలశర్మ—నా తండ్రి.

జోగన్న—మరి రెక్క లిచ్చిన తండ్రి కిదేనా మన్నన ?

గోపాలశర్మ—కొడుక్కి రెక్కలివ్వడం విరిచికట్టెయ్యడాని కేనా ?

జోగన్న—అబ్బో! చాలా ముందుకి వెళ్లిపోయా వన్నమాట.

గోపాలశర్మ—ఇంకా ముందుకి వెళ్లా లనే నా ప్రయత్నం నాన్నారూ ?

జోగన్న—అబ్బో !

గోపాలశర్మ—నా పురోభివృద్ధి కిప్పటికే మీరు చాలా అడ్డంకులు కలిగించారు. ఇక నైనా యీ రొక్కటి గుర్తించుకోవాలి.

జోగన్న—ఏమిటో అది ?

గోపాలశర్మ—నాకు వివాహం చెయ్యడం మీకు విధి. అది మీరు నెరవేర్చుకున్నారు, సంతోషం. అయితే, నాగార్హస్థ్య జీవితంమీద నాకు తప్ప మరెవరికీ హక్కులేదు.

జోగన్న—అలాగటోయ్? హక్కట హక్కు. నా మాట అలా వుంచు. నీ గార్హస్థ్యజీవితమే కాదు, నీ బతుకే యిప్పుడు నీ అత్తగారి చేతిలో వుంది, తెలుసా?

గోపాలశర్మ—ఆవిడ హద్దుమీరింది. ఆవిడ కిక మన్నన లేదు.

జోగన్న—సెబాస్! అదీ మాట. నాయనా, ఇప్పు డర్థం అయింది నీ తత్వం. చాలా సంతోషం. మొగుణ్ణి వాజమ్మని చేసి తండ్రి మాటమీద ఆడుతోంది ఆట నీ అత్తగారు. దానికి ప్రాయశ్చిత్తం కావాలి. నువ్వే చెయ్యాలి. చాలా బాగుంది. ఇన్నాళ్లకి మాట విన్నాను, నా బెంగ తీరింది. ముందు దీక్షి తుల్ని వెనక్కి రప్పించెయ్యి. నిశ్చితంగా నువ్వు చెన్నపట్నం వెళ్లిపో. పది రోజుల్లో నీకు జాబు రాస్తాను, సరీక్షిస్తూ వుండు. మరి నేను రామచంద్రపురం వెళ్లాలి, కోర్టుతో పని ఇప్పటికే తొమ్మిది మ్ముప్పా వయింది. భద్రం, కంగారుపడకూ! (వెళ్లి పోతాడు)

(పొంచి వింటున్న జానకమ్మ గభీమని లోపలికి వస్తుంది)

జానకమ్మ—ఏమిటి నాయనా, మీ నాయన చెబుతున్నారూ?

గోపాలశర్మ—స్పష్టంగా బోధపడలేదమ్మా! కుట్ర యేమయినా జరుగుతోందా?

జానకమ్మ—ఉండు, మీ నాయన సైకిల్ లెక్కారో లేదో చూసి రానియ్యి.

జానకమ్మ వాకట్లోకి వెళ్లి వెంటనే మళ్లీ వస్తుంది.

గోపాలశర్మ—ఎక్కాడ్రా ?

జానకమ్మ—ఆ ! కుట్ర అన్న కుట్ర కాదు నాయనా ! తల తిరిగిపోతోంది. పెళ్లిబేరా లని నా కనుమానంగా వుంది, తండ్రీ!

గోపాలశర్మ—అమ్మా, నువ్వు భయపడనక్కరలేదు. ఒక్క నాటికీ సాగ దది.

జానకమ్మ—నువ్వో మాట అన్నావు, చాలు నాయనా ! మొన్న గుళ్లో ప్రదక్షిణం చేస్తూ వుంటే కాళ్లకి చుట్టబెట్టుకుంది వెర్రిపిల్ల. గుండెల కదుముకున్నాను, ప్రాణాలు లేచివచ్చాయి. దాని బతు కంతా నీచేతిలో వుంది సుమా నాయనా !

గోపాలశర్మ—తెలుసునమ్మా, తెలుసు.

జానకమ్మ—ఇదిగో, నూరు రూపాయిలా కాగితం. ఎన్నటి కయినా నా చిట్టితల్లి నాయింటికి రాకమానదనీ, వచ్చిన వెంటనే అయిదు కాసుల బంగారపు కుంకుమభరణి దాని చేతిలో పెట్టాలనీ కూడబెట్టుకున్నా నిది, నీ దగ్గిర వుంచు నాయనా !

గోపాలశర్మ—అమ్మా, నాకు మాటలు రావడం లేదు. (తల్లికి పాదాభివందనం చేస్తాడు)

జానకమ్మ—అయ్యో, వెర్రితండ్రీ, అదీ నువ్వూ కలిసి చేసి నప్పుడు నాకు పాదాభివందనం. ఇప్పు డేమిటోయ్.?

గోపాలశర్మ—వెళ్లగానే వుత్తరం రాస్తా నమ్మా !

జానకమ్మ—చిరంజీవ ! మంచి ముహూర్తాన కుమాళ్ల తండ్రివై వెర్ధిల్లు నాయనా !

—

## మూడో రంగం

స్థలం—సుందరప్ప మేడమీద వొక వసారా.

సమయం—ఉదయం, తొమ్మిది న్నర.

సుభద్ర పుస్తకం చదువుకుంటూ కూచుని వుంటుంది.

తల్లి, రాజమ్మ యెదట నుంచుని వుంటుంది.

రాజమ్మ—నే నేమీ లోటుచెయ్య లేదు నీకు. ఇక ముందున్నా చెయ్యతలుచుకోలేదు. ఉన్న పిల్ల లందరూ వొక యెత్తూ నువ్వొక్కర్తివీ వొక్క- యెత్తూను నాకు, తెలుసా ?

సుభద్ర—(పుస్తకం చూస్తూ వూరుకుంటుంది)

రాజమ్మ—ఏం, వినపడిందా ?

సుభద్ర—ఆ, వినపడింది.

రాజమ్మ—నేను లక్ష అనుకున్నాను. కోటి చెయ్యా లని చూస్తున్నాను. మా అమ్మకి పెద్దకూతుర్ని నన్నావిడ యెలా చూసిందో, నాకు పెద్దకూతురివి నువ్వు, నిన్నలా చూసు కోవా లని నే నెంత ముచ్చటపడుతున్నానో దేవుడికి తెలుసు; కాని బ్రహ్మరాక్షసి నీ అత్తగారు—

సుభద్ర—నువ్వావి డ్నేమీ అనడానికి వల్లగాదు. ఆమాటలు వినలేను నేను.

రాజమ్మ—ఏమిటే వినలేవూ ? ఓసీ, యెంత అభిమానం ముంచుకువచ్చిందే నాతల్లీ ? నిన్నావిడ తీసుకువెళ్లి సజావుగా చూసుకుంటే యిక నావూసే అక్కర్లేకపోవు నేమో నీకు, సెబాసునే !

సుభద్ర—చెల్లాయి నిన్ను మరిచిపోయిందా ?

రాజమ్మ—అదెందుకు మరిచిపోతుందీ? రాజా మొగుడు దొంకాడు దానికి, తల్లిమాట లెక్కచేస్తున్నాడా అతనూ?

సుభద్ర—నీ కోరిక అలా వుందా?

రాజమ్మ—ఉండదూ? కన్నకూతుర్నిచ్చుకున్నాక అత్తగారు పెత్తనం చేస్తూ వుంటే వొప్పుకుంటానేం నేను?

సుభద్ర—నువ్వూ అత్తగారికి కాబోతున్నావు కదా?

రాజమ్మ—ఇద్దరు కొడుకుల్ని కనుకున్నాను, మాంతానా? నా కొడుకుల్ని నేను గీసిన గీటు దాటనిస్తానా?

సుభద్ర—ఇతర్లు మాత్రం అలా చెయ్యకూడదు, కదూ?

రాజమ్మ—ఇతర్లంటే, నీ అత్తగారికీ నాకూ సాపత్యం ఏటే? పుట్టెడు భూమి రాయించియిచ్చింది మా అమ్మ నాకు. నీ అత్తగారికేం వుందే నల్లవుద్ధరి?

సుభద్ర—చెల్లాయి అత్తగారికుందా?

రాజమ్మ—కనకనే యీడ్చేశానో మూలకి, వూరుకున్నానా?

సుభద్ర—నీ కొడుకుల అత్తగార్లు నీకంటె యెక్కువవాళ్లవుతారేమో?

రాజమ్మ—ఒక్కనాటి క్కాదు. మా అమ్మవంటి అమ్మ పృథివిమీద మరొకళ్లకి వుండడానికి వల్లకాదు. తెలుసా?

సుభద్ర—ఇప్పుడు తెలుసుకుంటున్నాను.

రాజమ్మ—తల్లివల్ల దమ్మిడీ అయినా యెరగదు కనక, యాభై సెంట్ల భూమికోసం కీచులాడుతోంది నీ అత్తగారు, చెప్పుకుంటే సిగ్గు.

సుభద్ర—ఇస్తా నన్నది యివ్వకపోడం మాత్రం నీకు గారవం మహా.

రాజమ్మ—నే నిస్తా నన్న దేమిటే? నే నిస్తా నన్నది రాయించే పారేశాను, ఏమిటే నే నివ్వనిదీ ? గతిలే నమ్మకి గంజే పానకం అన్నట్టు మొదట యకరానికే వొప్పుకుని, తీరా, అంతా ముచి క్కొడికి వచ్చాక మళ్లీ పేచీలా ?

సుభద్ర—యకరం నరా యివ్వడానికి నువ్వెందు కొప్పుకో వాలీ చివరికీ ?

రాజమ్మ—ఇవ్వడానికే వొప్పుకున్నానో, తనని బుట్టలో పెట్ట డానికే వొప్పుకున్నానో కని పెట్టగలిగిందా నీ అత్తగారు ? పంచ కావ్యాలూ చదివిన పండితురాలు ట మళ్లీ.

సుభద్ర—నీ కా చాటేం ?

రాజమ్మ—ఆవిడ — పేరాసేం

సుభద్ర—అంత యీాపడించుకునే దానవు, ఆవిడతో వియ్యం అందడాని కెందుకు సిద్ధపడ్డావూ నువ్వూ ?

రాజమ్మ—తల్లికి సెంటు భూమి లేకపోయినా, పిల్లాడు బి.ఏ. కదా అని ఆశపడ్డాను. తండ్రి నాలుగు పుట్ల భూమి సంపాదిం చాడు గదా, తలో పుట్టెడూ వుంటుంది, లోటులే దని సమా ధానపడ్డాను, నాకు తెలియక కాదు.....ఎందుకూ ? అసలు నీ మొగుడి దగ్గిర వుంది చేతకానితనం.

సుభద్ర—ఇక చాలించు. నా పెనిమిటి నంటే నేను వినలేను. నేను సహించలేను తెలుసా ?

రాజమ్మ—ఆ, యేమిటే, నువ్వు సహించలేవా ? సహించక నువ్వు చేసే దేమిటే ? మా అమ్మ నాకు రాయించి యిచ్చిన దాల్లో నాలుగు యకరాలు నీపేర వేయిద్దా మనుకుంటున్నాను,

నామీద నువ్విలా తిరగబడితే దమ్మిడీ ముట్టచెబుతానా నీకు నేను ?

సుభద్ర—నా పెనిమిటి రెక్కలు చల్లగా వుంటే నా కదే చాలు. దయాధర్మభిక్షంగా నా కెవరూ యేమీ యివ్వనక్కర్లేదు.

రాజమ్మ—అబ్బో, యెంత రోషం వచ్చిందే మాతల్లీ ? అన్నా, నామీద తిరగబడుతున్నావా ? ఎవరు మప్పుతున్నారు నీ కిదంతా ? అడిగో దీక్షితు లన్నయ్య వస్తున్నా డెందుకో, చూసి వస్తా నుండు నీపని చెప్తా.



## నాలుగో రంగం

స్థలం—సుందరప్ప మేడలో, కిందిహాలు.
సమయం—ఉదయం, పదిగంటల వేళ.

సుందరప్పా, దీక్షితులూ లోపలి గుమ్మం పక్కగా కవాచీబల్లమీద కూచుని వుంటారు. రాజమ్మ, సందులోకి వున్న గుమ్మం దగ్గరగా తుంగచాపమీద కూచుని వుంటుంది

దీక్షితులు—పోన్నీ, అదలా వుంచు. వియ్యపురాలికీ ఆడపడుచులకూ యివ్వవలసిన లాంఛనాల బాపతు మూడు వందల నలభై యెనిమిది రూపాయీలూ యిచ్చేస్తే, వాళ్లు, పిల్లని ఇవాళ తీసుకుపోతారు. దీని కేం చెబుతావు రా ?

సుందరప్ప—మాకూ మాకూ వుండుకున్న తగువులు పరిష్కారం కాకపోయినా, పిల్ల అయినా సుఖపడుతుంది, అదీ వొకదారే.

రాజమ్మ—అదేం దారండీ గోదారి? ఈపురమూయిం పెవరి దయ్యా దీక్షితు లన్నయ్యా?

దీక్షితులు—ఎవరి దైతే నీ కెందుకూ?

రాజమ్మ—ఇక చెప్పనక్కర్లేదు, తెలిసేపోయింది. విద్యాపురా లెంత మొత్తు వేసిందో మీా కేమయినా అర్థం అయింది టండీ? ఈవంకతో, తనకూ తన కూతుళ్లకూ రావలసింది మెల్లిగా లాక్కుంటుంది. తరవాత, పిల్లని తీసుకువెళ్లి కొడుకు నుసి కొలుపుతుంది. ఇక పిల్లనీ మనల్నీ మూాడు చెరువుల నీళ్లు తాగి స్తాడా అబ్బాయి. అబ్బో, ఎంత నెల్లూరి నెరజాణ అయిందీ వదినా!

దీక్షితులు—నువ్వు దాన్ని నెల్లూరి నెరజాణ అనడమూ, నిన్నది సర్వోపల్లి సర్వజాణ అనడమూ—ఇంతేనా సడసం?

రాజమ్మ—ఏ మొగం పెట్టుకుని నన్నంటుందీ ఆవిడా?

దీక్షితులు—నీ కున్న మొగం దానికీ వుంది తెగిస్తే.

రాజమ్మ—ఇది తెగించడం కాకపోతేనా?

దీక్షితులు—పాపం, యేమయినా నాతో మాట్లాడి తేనా అది?

రాజమ్మ—ఆవిడ నీతో యెందుకు మాట్లాడాలీ? నేనా యేమిటి వచ్చే దేమిటో పోయే దేమిటో తెలుకోకుండా వడ వడ వాగడానికి? మొగుడికి పాఠం చెప్పింది, తాను ఏమీా యెరగనట్టు అంతఃపురంలో కూచుంది, రాణివాసపు స్త్రీ లాగ.

దీక్షితులు—(సుందరప్పతో) విన్నావా?

సుందరప్ప—జానకి నేమన్నా పాపం చుట్టబెట్టుకుంటుంది.

రాజమ్మ—అలాగటండీ? పెత్తాత మనమరా లయినందుకు బాగానే వ్వాసుకు వచ్చారు పాపం ఆవిణ్ణి. అయితే, మీా కే

దిలాంటి అభిమానం యెన్నడూను. పోనీగానీ,
లాంఛనాల బాపతు ఇచ్చేస్తే పిల్ల నివాళ
తీసుకువెడతా రన్నావుగదా, మరి రాకపోకల మాటేమి
టయ్యా ?

దీక్షితులు—నేను పూచీపడలేను సుమా !

రాజమ్మ—అయితే వల్లకాదు. (చేతులు జాడించి మాతి
బిడాయించుకుంటుంది)

దీక్షితులు—పిల్లని అట్టే పెట్టేసుకుంటావా ?

రాజమ్మ—ఎటు చూసినా చిక్కే వచ్చిందయ్యా నాకూ ?
ఇక్కడ పిల్ల గోల పట్టలేకుండా వున్నాను. అక్కడ వారు పట్టు
విడిచిపెట్టకుండా వున్నారు. తప్పెవరిదో తెలుసుకోకుండా అమ్మ
లక్క లందరూ నన్నాడిపోసుకుంటున్నారు, చాటునా మాటు
నాను.

దీక్షితులు—నువ్వు మాత్రం పట్టు విడిపెట్టావా ?

రాజమ్మ—వారి కిస్తా మన్నది యెప్పుడైనా యివ్వ మన్నా
ముటయ్యా మేమూ ?

దీక్షితులు—ఇస్తే యీతగువు లెందుకు వస్తాయీ ?

రాజమ్మ—వారు పుచ్చుకోందే మమ్మ ల్నేమి చెయ్య
మంటావయ్యా నువ్వూ ?

దీక్షితులు—వా ళ్లెందుకు పుచ్చుకో లేదూ ?

రాజమ్మ—మా యిల్లుగో కెయ్యా లని.

దీక్షితులు—చూడూ, జరిగిం దంతా వేరే పెట్టుకుని యిలాగ
పూటీపోటీ లాడడం మంచిది కాదు.

రాజమ్మ—నే నేమన్నా నోయ్ ?

దీక్షితులు—అయితే, ను వ్వేమిసా నన్నావు, ఏమిచ్చావు ?

రాజమ్మ—యాకరమే కాదుటయ్యా ?

దీక్షితులు—కాదు, యకరంనర. (సుందరప్పతో) ఏమిరా, నువ్వన్నావా లేదా ?

సుందరప్ప—అన్నమాట నిజమే.

రాజమ్మ—ఆయన మాట లెక్క—మిటయ్యా అంటే మాత్రం ? ఆయన కేం తెలుసునూ ? వాళ్లెంత అడిగితే అంతా యివ్వవలసిందే ?

దీక్షితులు—వాళ్ల సంబంధం కావలిస్తే యివ్వవలసిందే నమ్మా !

రాజమ్మ—అదే కాదూ వారి బింకం ? కావలసినవాళ్లు కదా అని మేము వెళ్లాం. వెర్రినాగమ్మలు కదా అని వారు బందాలు వేశారు.

దీక్షితులు—అంటే, ముందు తప్పు మీాదీ, తరవాతి తప్పు వాళ్లదనీ. ఉభయులూ పేచీలే ప్రధానం చేసుకున్నారు చివరికి.

రాజమ్మ—మా దగ్గిర లేదు సుమా పేచీ.

దీక్షితులు పెద్దకూతురికి యకరమూ, చిన్న కూతురికి యకరంనరా యివ్వడం—దీనిపే రేమిటో ?

రాజమ్మ—వాళ్లందుకే అంగీకరించారు, దాని పే రేమిటీ ?

దీక్షితులు—(సుందరప్పతో) అస లేం జరిగిందిరా ?

సుందరప్ప—పెద్దపిల్లకి యకరం యిస్తా నన్నాను. వాళ్లంగీకరించారు. తరవాత చిన్నపిల్లకి యకరంనర యివ్వవలసివచ్చింది. దాంతో వచ్చింది పేచీ.

దీక్షితులు—ఎప్పుడు వచ్చింది ?

సుందరప్ప—పెళ్లి వారం వుందనగానూ.

దీక్షితులు—ఏమిటి పేచీ ?

సుందరప్ప—మాకూ_డా యాకరంనరం యిస్తేనే అని కభురంపాడు జోగన్న.

దీక్షితులు—పంపితే ?

సుందరప్ప—మా మామగారు వొప్పుకోమన్నారు.

దీక్షితులు—నీతో ఆలోచించారా ఆయనా ?

సుందరప్ప—కూతురితో ఆలోచించారు. మాట మాత్రం నన్ననమన్నారు.

దీక్షితులు—నువ్వన్నావు

సుందరప్ప—తరవాత, మా మామగారూ, యాకరమే రిజస్టరీ చేయించారు పరమరహస్యంగా; కాని మూడు ముళ్లూ పడ్డ తరవాత, కట్నం చదివినప్పుడు వా డదేమి టన్నాడు. అంటే, మొదట అంతే వొప్పన్న మన్నారు మా మామగారు.

దీక్షితులు—అంటే ?

సుందరప్ప—ఇంకేం వుందీ ? పెళ్లివారు వొక్క పూటయినా భోజనాలకు రాలేదు. ఒక్క స్థాలీపాకసమయాన తప్ప పెళ్లి కొడుకు కూడా యిక్కడ భోజనం చెయ్యలేదు. అగ్నిహోత్రాలూ, తక్కిన తంతున్నూ మాత్రం జరిగించుకున్నా, రిదంతా నువ్వెరగందా ?

రాజమ్మ—ఒక వూరేగింపా, వొక పసుపుల నలుగులా, వొక బంతు లాడింపా—మా కేమి ముచ్చట్లు తీరా యన్నయ్యా ? ఇవన్నీ జరుగుతూ చిన్నపిల్ల కులుకుతూ వుంటే, పెద్దపిల్ల—

దీక్షితులు—అంత అల్లరి కయినా వొప్పుకున్నావు గాని అన్న య్యాభయి సెంట్లూ యివ్వనిచ్చావు కావు నువ్వు. శక్తి అంటే నీదీ.

రాజమ్మ—య్యాభై కాదు, వొక్క సెం టివ్వనివ్వను. నాకు పిసాళం యెత్తుకువచ్చిం దంటే లాంఛనాల సొమ్ము కూడా యెగబెట్టేస్తాను. నా పెద్దపిల్ల నాకు పెద్దకొడుకు కనుకుంటూను, చేతకా దనుకున్నావా యేమిటయ్యా నాకూ ?

దీక్షితులు—నిన్నెవ రనగలరూ ఆమాటా ? అయితే, ఆ పెద్ద కొడుక్కి పెళ్ళాన్ని మాత్రం తెచ్చిపెట్టవు, కదూ ?

రాజమ్మ—పెట్టిపుట్టందే యెలా వస్తాయీ అందాలూ సుఖాలూనూ ? చిన్నపిల్ల యేణ్ణర్థంనుంచి చిలకలాగ కాపరం చేసుకుంటోంది, పెద్దదాని కర్మం కాకపోతే యిదేమిటీ ?

దీక్షితులు—ఇది కర్మమే అయితే, దానిది కాదమ్మా !

రాజమ్మ—నాదా ?

దీక్షితులు—అక్షరాలూను. మీరు మెట్టు దిగకపోతే అప్రతిష్ఠ మీది కాని వాళ్ళదీ కాదు, నీ కూతురిదీ కాదు.

రాజమ్మ—వా ళ్ళెందుకు దిగరంట ?

దీక్షితులు—దిగారు కారూ ? లాంఛనాల సొమ్మిచ్చేస్తే—

రాజమ్మ—రాకపోక లుండవని నువ్వే చెబుతూ మళ్ళీ దిగారు దిగా రంటా వేమిటయ్యా ?

దీక్షితులు—మీకంటే దిగారు.

రాజమ్మ—పెళ్ళిలో ముచ్చట్లూ లేవు, మురిపాలూ లేవు, ఇప్పుడయినా లేకుండా—

దీక్షితులు—అంటే ?

రాజమ్మ—నలుగురూ బిలబిల్లాడుతూ రావడమూ, కార్యం సలక్షణంగా చేసుకోడమూ, పిల్లని తీసుకు వెడుతూ పంపుతూ వుండడమూ, అల్లుడు వస్తూ వెడుతూ వుండడమూ—

దీక్షితులు—ఇక అవేమీ జరగవు. కార్యాని క్కూడా ఇక్కడికి రారు. పిల్ల నయినా కట్టుబట్టలతో పంపెయ్యాలి.

రాజమ్మ—అలా వొక్కనాటికి జరగదు.

దీక్షితులు—సరే అయితే.

రాజమ్మ—ఇలాంటి రాయబారం యేలా తెచ్చావయ్యా నువ్వు ?

దీక్షితులు—ఏమంటావురా ?

రాజమ్మ—ఆయ న్నడిగే దేమిటయ్యా ? ఆయనేం చెప్పగలరూ ? కారాకిల్లీ నమలడమూ, చుట్ట కాల్చడమూ తప్పిస్తే వొక్క కానీ సంపాదించలేరు, ఇస్తా ననరూ ఆయనా ? ఆయన లెక్కేమిటయ్యా యిందులో ? వా ళ్లడిగిందల్లా అడిగినంతా యిచ్చి మొగపిల్లలను పాడుచేసుకోమా ?

దీక్షితులు—(వాచీ చూసుకుని) అయితే, నే నిక వెళ్లిపోతాను. ఇక రెండు నిమిషాలే గడువు. ఈలోపున వెళ్లి నేను ఆపుచెయ్యకపోతే నీ అల్లుడు వెళ్లిపోతాడు. జట్కాలో సామాను వేయించుకుని సిద్ధంగా వున్నాడు వాడు. మీరు రాజీకి అంగీకరిస్తే వారంరోజు లుండి కార్యం చేసుకుని మీ పిల్లని కూడా చెన్నపట్నం తీసుకువెళ్లిపోతాడు.

సుందరప్ప—అంత చెప్పుల్లో కాళ్లుంచుకుని మాట్లాడితే తేలేది ట్రాయిదీ ?

రాజమ్మ—రాజీపడ్డా పిల్లని వూళ్లో వుంచడూ? అయితే, పోమ్మను, చెన్నాపట్నం వెళ్లినా సరే, శిఖాకోళం వెళ్లినా సరే యింక.

దీక్షితులు—అవును లే, ఎవళ్ల తోవ వాళ్ల దయితప్పు దేవ ళ్లేమయిపోతే యెవళ్ల కేం?

రాజమ్మ—అబ్బో, యిలాంటి రాకడ వచ్చారూ వియ్యాల వారు? బాగుంది, ఇక ఆయూభై సెంట్లే గాదు, లాంఛనాల బాపతు పై పదహార్లు కూడా యివ్వనివ్వను.

దీక్షితులు—అసలు కూడా యివ్వకపోతే మాత్రం యేం?

రాజమ్మ—అయితే, మూడ్డో మేలు. సొమ్ము చేదా యేమిటి మాకు?

దీక్షితులు—పిల్ల సుఖం చేదవుతుంది గాని, సొమ్మెందుకు చేదవుతుందీ మీకూ?

రాజమ్మ—ఇలా అంటేనే నాకు వొళ్లు మండుతుంది.

దీక్షితులు—ఏం?

రాజమ్మ—వాళ్లు తిన్న నైనవాళ్ళా?

దీక్షితులు—అక్కడ నే నెంత దెబ్బలాడి వచ్చానో యెరుగుదువా నువ్వు?

(అప్పుడు సుభద్ర వస్తుంది)

రాజమ్మ—పెత్తనాలకా యేమిటే బయలుదేరావూ?

సుభద్ర—కాదే.

రాజమ్మ—మరెందుకూ, ఎక్కడికి?

సుభద్ర—(చూస్తూ వూరుకుంటుంది)

రాజమ్మ—మాట్లాడ వేమే ?

సుభద్ర—ఎందుకే ?

రాజమ్మ—పో, పో, పిన్నిగా రింటికి మాత్రం రోజూ యెందుకూ ?

సుభద్ర—పోతున్నాను.

రాజమ్మ—మరి పోవేం ?

సుభద్ర—పోతూ వుంటేనే ?

రాజమ్మ—వీధిలో జట్కా ఆగిన ట్టుం దేమిటయ్యా దీక్షితు లన్నయ్యా ?

దీక్షితులు—అలాగే వుంది.

రాజమ్మ—చావలివారి గుమ్మంలోనా మన గుమ్మంలోనా ?

దీక్షితులు—మన గుమ్మంలోనే.

రాజమ్మ—(సుందరప్పతో) వెళ్లి చూడండీ యెవరోను.

సుందరప్ప—గుమ్మంలోకి వచ్చినవారు లోపలికి రాకుండా వుండిపోతారా ?

రాజమ్మ—సడే !

సుందరప్ప—ఎవ్రరా ?

దీక్షితులు—చే——ప్తా. బండి దిగారు. మొగం కనపడలేదు మరి.

(తెరలో బూట్సు చప్పుడు)

సుందరప్ప—గుమ్మా లెక్కుతున్న ట్టున్నారు.

దీక్షితులు—నీ అల్లుడే రోయ్ !

సుందరప్ప—(చూస్తూ వూరుకుంటాడు)

రాజమ్మ—(సుభద్రతో) లోపలికి పోవే. వెళ్లిపోవే, పోవేమే?

(గోపాలశర్మ వచ్చేస్తాడు)

గోపాలశర్మ—(సుభద్రతో) నీ కెవరు కావాలి. మీ అమ్మా నేనా ?

సుభద్ర—మీరే.

గోపాలశర్మ—అయితే, నాతో వచ్చేసెయ్యి.

సుభద్ర—పదండి.

(ఇద్దరూ బయలుదేరతారు. సుభద్ర ముందుకి వెళ్లిదాకా వుండి గోపాలశర్మ వెనక్కాల వెళతాడు)

రాజమ్మ—(కంగారుతో వాణికిపోతూ) ఎక్కడికే, యెక్కడికే, వోసి నీ యిల్లు——వెనక్కి మళ్లుతావా మళ్లవే ? (సుందరప్పతో) చూస్తా రేమండీ, బండిపోటుదొంగ లాగ వచ్చి పిల్లనలా లాక్కుపోతూ వుంటేనూ ?

సుందరప్ప—(మొగం వంచుకుని వూరుకుంటాడు)

(వీధిలో జట్కా కదిలిన చప్పుడు)

రాజమ్మ—బెల్లం కొట్టిన రాయిలాగ మాట్లాడ రేమండీ ? అయ్యో, అయ్యో, బండి కదిలింది, వెళ్లిపోతోంది, మేఘాల మీద యెగిరిపోతోంది. నువ్వాయినా అడ్డుకున్నావు కాదేమి టన్నయ్యా ?

దీక్షితులు—మొగుణ్ణి పెళ్లాన్ని విడతియ్య మంటావా ?

రాజమ్మ—నా బంగారం మంచి దైతే నిన్నపడం యెందుకూ? ఎక్కడ మెచ్చిపోతుందో అని వెయ్యి విధాల——అందర్నీ వాక

యెత్తునా దా న్నొక యెత్తునా చూస్తూ వుంటే యెంత పని చేసింది విశ్వాసఘాతుకురాలూ ?

దీక్షితులు—(పక్కకి చూస్తూ యేమీ యెరగనట్టు తల పంకించుకుంటాడు)

రాజమ్మ—ఇందుకే ఆడవాళ్లకి పెట్టడం అంటే నాకు తల నొప్పి.

దీక్షితులు—చిన్నదానికి పెట్టడం మానేశావా ?

రాజమ్మ—అది యిలాగే చేసిందా ?

దీక్షితులు—నువ్వు దాన్నిలాగే చూశావా ?

రాజమ్మ—పోవయ్యా, నేర్చుకున్నావు మాటలు. ఇక నా యింటికి రానిస్తానా దొన్న డయినా ?

సుందరప్ప—అది వస్తుందా, అసలు ?

దీక్షితులు—అది కాదు మాట, నువ్వుండరా బావా ! (రాజమ్మతో) రానివ్వడం దాకా వెడతావు, అది రాకపోతే నువ్వుండగలవా ?

రాజమ్మ—శగా పట్టా నంటే నా సంగతి నువ్వెరగవు. చూస్తూ వుండు, దాని మొఖమయినా చూస్తా నేమో నేను?

దీక్షితులు—ఊకభర్ల కేంలే ?

రాజమ్మ—ఏమమ్మా ?

దీక్షితులు—మళ్లీ యీరోజుల్లో నువ్వు చెన్నపట్నం బయలు దేరకపోతే నా చెవి తెగ్గోయించుకుంటాను సరా ?

రాజమ్మ—ఎందు కమ్మా ?

దీక్షితులు—కూతురికి పురుడు పొయ్యడాని కమ్మా !

రాజమ్మ—చాల్లేవయ్యా !

దీక్షితులు—అలాగే వుంటుం దమ్మా యిప్పుడూ. "ఏమయ్యా అన్నయ్యా, మీ బావకి తీరుబడి లేకపోతే నువ్వయినా కాస్త సాయం కాగూడదు టయ్యా ? పిల్ల యెంత కష్టపడిపోతోందో నయ్యా చేసుకోలేక ? ఎనిమిదో నెల వెళ్ల వచ్చిందయ్యా పాపం ! రావయ్యా, నన్నక్కడ దింపేసి—క్షణం వుండవద్దు, ఆరాత్రి మెయిల్లోనే మళ్లీ వచ్చేస్తువుగా నయ్యా అంటూ నువ్వప్పుడు చేతులూ కాళ్లూ పట్టుకుని మాతిమాలకపోతే—

రాజమ్మ—అంతే బేలపీనుగు ననుకున్నావు టయ్యా నేను ?

దీక్షితులు—కాక, నువ్వు ఆకాశంనుంచి వూడిపడ్డానా ?

రాజమ్మ—అలాగేం ?

సుందరప్ప—ఇంతెందుకూ ? అయిం దేదో అయిపోయింది, ముందు సంగతి మాందు చూసుకుందాం, ఇప్పటి కింతటిలో వూరుకోండి గప్ చిప్ గా.

రాజమ్మ—అదిగో, మిమ్మల్ని చూస్తే వొళ్లు మండిపోతోంది నాకు. ఇప్పుడా వేళాకోళాలూ వెక్కిలింతలూను ?

దీక్షితులు—వోరే బావా, కాస్సేపు నువ్వావతల వుంటరా.

సుందరప్ప—బతికించావు. (మేడమీదికి వెళ్లిపోతాడు)

## అయిదో రంగం

అదే స్థలమూ, అదే సమయమూను.

(ఉ)సిల్లిపోతూ, కళ్లు నలుముకుంటూ, తూలిపోతూ వచ్చి రాజమ్మ దీక్షితుని పక్కన కవాచీ బల్లమీద కూలబడుతుంది.

దీక్షితులు—చెల్లీ !

రాజమ్మ—ఎం—దు—క—న్న—య్యా ?

దీక్షితులు—అదేమిటమ్మా ? శుభ మల్లే నీ కూతురు తన మొగుడివెంట వెళ్లడం యేమిటి, నువ్వో కళ్లల్లో నీళ్లు పెట్టుకోడం యేమిటి ? తప్పు తప్పు, వూరుకో, వూరుకో.

రాజమ్మ—ఎంత పని జరిగిం దయ్యా ?

దీక్షితులు—ఎప్పు డేమి జరుగుతుందో మన కేమి తెలుస్తుం దమ్మా ? కాకపోయినా, ఇదయినా, బాగానే వుంది, నీ తప్పు నీ కూతురు దిద్దేసింది.

రాజమ్మ— కనిపెట్టలేకపోయా నయ్యా దాని తపనా ! ఎంత యిదీ కాకపోతే, కార్యం కాకుండా మొగుడితో వెళ్లిపోతుంది టయ్యా అయిన యింటి పడుచూ ?

దీక్షితులు—చూశావా, యిప్పటికి బోధపడింది నీకు. దాగిందా, ఆగిందా, నిజమే.

రాజమ్మ—ఎంత బలగం వుందయ్యా దానికీ ? గుమ్మానికి తోరణం కట్టుకున్నా మంటే నూరుమందికి తక్కువ వస్తారు టయ్యా నాయింటికి చుట్టాలూ ? అలాంటిది, ఎవళ్లూ రాకుండా—చివరికి తల్లిపీసు గయినా దగ్గిర లేకుండా—ఎంత వుసూరు మంటుందో నోయ్ వెర్రిపిల్లా ?

దీక్షితులు—అబ్బే, అదలాంటిది కాదమ్మా అదీ.

రాజమ్మ—ఒక తలంటు లేకుండా, ఒక కాళ్లు కడగడం లేకుండా, కొసకి మంగళహారతయినా లేకుండా—అయ్యో, ఇంటికి పెద్దాడబడుచోయి తండ్రీ !

దీక్షితులు—కాదూ మరీ? కాని దాటిపోయాక యేమి చేస్తామూ?

రాజమ్మ—ఇహ నే నుండలేనోయ్! నన్ను కూడా చెన్నాపట్టం తీసుకువెళ్లవ్రూ?

దీక్షితులు—(పక్కకి చూస్తూ వూరుకుంటాడు)

రాజమ్మ—ఊరుకుంటా వేమయ్యా? మాట్లాడ వేమయ్యా?

దీక్షితులు—మాట్లాడ కేం గానీ—వూరుకోడానికి మాత్రం యెలా వీలు కానీ—సంవత్సరాని క్కాసీ కలగ దనుకున్న తొందర ఇవాళ—ఈక్షణంలో కలుగుతోంది నీకు.

రాజమ్మ—ఇంకా కలుగుతోం దేమిటి, కలిగే వేసిందయ్యా! నాతండ్రివి కాదూ? తీసుకువెళ్లవ్రూ?

దీక్షితులు— నే నో మాట చెబుతాను వింటావా?

రాజమ్మ—ఏమి టన్నయ్యా అదీ?

దీక్షితులు—నీకు కోపం వద్దుసుమా!

రాజమ్మ—ఇంకెక్కడి కోపమయ్యా, కడుపు తరుక్కుపోతూ వుంటేనూ?

దీక్షితులు—నిజమే అను. కాని నువ్వు లోకువ వయిపోతావు, చెప్పవద్దూ?

రాజమ్మ—ఆడపిల్లని యెప్పుడు కన్నానో అప్పుడే లోకువ వయిపోయాను. ఇప్పుడు కొత్తగా వచ్చిన విశేషం యేమిటయ్యా?

దీక్షితులు—నువ్వెంత బేల వంటే నే నెక్కడ నమ్మతాను గానీ—

రాజమ్మ—పుండుమీద కారం చల్లుతావా అన్నయ్యా?

దీక్షితులు—నా నైజమే అలాంటి, నే నేమి చెయ్యగలనూ?

రాజమ్మ—కాదు కద, నే నెరగనూ? దిక్కు—మాలిన కర్మం తిక్కవస్తే తప్పుకోలేనయ్యా నేను. అందుకు తగ్గ శాస్తి చేశా డన్నయ్యా దేవుడు.

దీక్షితులు—(పక్కకి చూస్తూ తల పంకించుకుంటాడు)

రాజమ్మ—మాట్లాడ వేమయ్యా?

దీక్షితులు—నా కేమీ తోచడం లేదమ్మా!

రాజమ్మ—నీకు తోచకపోతే నేను చెబుతాను వినవయ్యా!

దీక్షితులు—విని యేమిటి చెయ్యడం? నీ అల్లుడు వెనక్కి రాడు. నీ కూతుర్ని కూడా రానివ్వడు. వాడు రానివ్వడం యేమిటి, నీ కూతురే రాదు.

రాజమ్మ—వాళ్లు రావడం యేమిటయ్యా, మనమే వెడదాం అక్కడికి.

దీక్షితులు—వెడితే మాట్లాడకపోతే?

రాజమ్మ—నా కూతురు అలాంటిది కాదోయ్!

దీక్షితులు—వాడు పెంకిఘటం అని తెలుసునుగదా పోనీ?

రాజమ్మ—రామరామా, అంతమాట అనకయ్యా! అత నైనా చాలా ఓపిక కలవాడు గానీ, తొందరమనిషి కాడు.

దీక్షితులు—ఆహా, దైవలీలలు!

రాజమ్మ—అదేమిటన్నయ్యా?

దీక్షితులు—మన అవసరాన్ని పట్టి అవతలివాళ్ల నైజాలు మారిపోతాయి కాబోలు!

రాజమ్మ—అది కాదయ్యా!

దీక్షితులు—ఏది కాదు, ఇప్పు డేనా వాణ్ణి బందిపోటుదొంగ అన్నావూ?

రాజమ్మ—వొళ్లు తెలియనప్పు డన్నా నా మాట. ఇప్పుడు మణిపూస అని తోస్తోంది. కాకపోతే, పిల్లలు దొరకరుటయ్యా అతనికీ, నా కూతురికోసమే కనిపెట్టుకుని వుండాలా? అతనికేం, కురూపా, చదువు లేనివాడా, చేతగానివాడా?

దీక్షితులు—అలాంటివాడికి నువ్వెంత ఆయాసం కలిగించావో కూడా బోధపడుతోందా యిప్పుడూ?

రాజమ్మ—తెలుస్తోం దయ్యా, దాపరికం యెందుకూ?

దీక్షితులు—ఇక నే నక్కన్ను పట్టలేను. ఉన్న దున్న ట్టనేస్తాను.

రాజమ్మ—ఏమి టది?

దీక్షితులు—ఇక్కడ నువ్వూ అక్కడ జోగన్నా చేశా రిదంతాను.

రాజమ్మ—మరి వియ్యపురాలు?

దీక్షితులు—దా న్నేమన్నా పంచమహాపాతకాలూ చుట్టబెట్టుకుంటాయి.

రాజమ్మ—చూశావా? నా దంతా భ్రాంతే నంటావా?

దీక్షితులు—భ్రాంతిమాత్రమే అయితే వొకదారే.

రాజమ్మ—ఇం కేమి టయ్యా?

దీక్షితులు—వల్లమాలిన అహమిక. అంతు లేని మాఢ్యం గడ్డకట్టిన మౌర్ఖ్యం—

రాజమ్మ—రామరామా! పదిన్ని ఎంతెంతేసి మాట లన్నా నయ్యా నేనూ?

దీక్షితులు--దాన్ని వృాసుకవచ్చా డని నీ మొగుణ్ణి కూడా యీసడించి——

రాజమ్మ—ఎంత పాపాని కొడిగట్టుకున్నా నయ్యా నేను! ఇదెలా పోతుం దయ్యా?

దీక్షితులు—నువ్వే ఆలోచించు.

రాజమ్మ— వదిన కాళ్లమీాద పడితే?

దీక్షితులు—అదొక దారే; కాని పడగలవా?

రాజమ్మ—మరో దారెదుకూ యింకా? ఆవిడకు పెద్ద కొడుకూ నాకు పెద్దకూతురూనూ. ఇద్దరూ దిక్కులేనివాళ్ల లాగ యెక్కడో చెన్నాపట్నంలో——

దీక్షితులు—వాళ్లు కూడా పాపం చేసుకున్నారు, వెనకటి జన్మలో

రాజమ్మ—నా కడుపున పుట్టడమే నా కూతురు చేసుకున్న పాపం. నా అల్లుడు కావడమే అతను చేసుకున్న పాపం. నా పాపం నాకు తెలిసింది, నే నిక నిలవలేను. నన్ను తీసుకువెళ్లి ముందు వదిన కాళ్లమీాద పడెయ్యవోయి తండ్రీ!

దీక్షితులు—(పెద్ద నిట్టూర్పు విడుస్తూ చూస్తూ వూరు కుంటాడు)

రాజమ్మ—నాకు లేకుండా చేసుకోడమే కాకుండా ఆవిడ కూడా యీా ముచ్చట తీరకుండా చేశాను నేను. పదవయ్యా బతిమాలి ఆవిణ్ణీ పిల్లల్నీ కూడా తీసుకువెళదాము.

దీక్షితులు—మనం నింపాదిగా బయలుదేరి వెడతాం సరే; కాని రేపు రాసిన ముహూర్తం వుందికదా? నీ కూతురికీ అల్లు డికీ తారాబలం కుదిరివుంటుం దేమో?

రాజమ్మ—అయ్యో, అయ్యో, తొందరపడిపోతారో యేమిటో యెలాగ తండ్రీ?

దీక్షితులు—వా డంత దురుసుమనిషి కాడు గానీ—నీ కూతురే—

రాజమ—నన్ను సూదులతో పొడవక తంతి కొట్టెయ్యవయ్యా వెళ్లి. నా తండ్రివి కామా? నా నాయనవు కాదూ?

దీక్షితులు—వెడతానులే.

రాజమ్మ—ఇంకా యెప్పుడో వెడితే యెలాగయ్యా? ఇంతకీ, మంచం యెప్పు డయ్యా వెళ్లడం?

దీక్షితులు—వారం రోజులు చూసి వెళ్లవచ్చు. రేపు వెళ్ల వచ్చు. ఇవాళ వెళ్లవచ్చు ఈక్షణంలో వెళ్లవచ్చు.

రాజమ్మ—మరయితే లే. (లేచి దీక్షితులి చెయ్యి పట్టుకుని లేవతియ్యపోతుంది)

దీక్షితులు—(కూచునే వుండి) ముందు నువ్వు కూచో చెబుతాను.

రాజమ్మ—(యధాప్రకారంగా కూచుని) మరి చెప్పూ.

దీక్షితులు—(ఆలోచిస్తాడు)

రాజమ్మ—ఆలస్యం అయిపోతోందయ్యా!

దీక్షితులు—నోటికి కేలా వస్తే అలా చెలిగెయ్యవచ్చు గానీ, కూచున్నవాళ్లం కూచున్నట్టు వెళ్లివాలా లంటే సాధ్యం టమ్మా?

రాజమ్మ—నీయిష్టంవచ్చినట్టు కోసెయ్యి నన్ను. కాని నే నిక క్షణం వుండలేను. (లేచినుంచుని) మంచున్న పాళంగా నన్నీ వూరయినా దాటించాలి నువ్వు.

దీక్షితులు—(చెయ్యి పట్టుకుని రాజమ్మని కూచోపెట్టి) నీ కూతురూ అల్లుడూ బిక్కవోల్లో పన్నెండు గంటల పాసెంజరందుకోడానికి వెడుతున్నారు. భోజనాలు చేసి మనం సాయంత్రం మెయి లందుకోడానికి ద్వారపూడి వెడదాం.

రాజమ్మ—వెడితే ?

దీక్షితులు—వాళ్లు రేపు ఉదయం పదకొండింటికి గాని చెన్న పట్నం వెళ్లలేరు. మనం తొమ్మిదింటికే వెడతాం.

రాజమ్మ—తరవాత వాళ్లెక్కడికి వెడతారో మన కేం తెలుస్తుందయ్యా ?

దీక్షితులు—తెలవకపోతేం? మనం స్టేషనులోనే వుండిపోతాం.

రాజమ్మ—ఉండి ?

దీక్షితులు—నేను బజారుకి వెళ్లి గంపెడుపూలదండలు తీసుకు వస్తాను. రైలు దిగాటప్పటి కెదురువెళ్లి నీకూతురికీ అల్లుడికీ మెడతిరక్కుండా మన మంతా తలో దండా వేద్దాం.

రాజమ్మ—వెర్రిపిల్ల, అలా చేస్తే నా కూతు రెంత సిగ్గుపడి పోతుందో నోయ్ ?

దీక్షితులు—సిగ్గా ? సిగ్గున్న మనిషే అయితే, అది పట్ట పగలు——నువ్వు చూస్తూ వుండగా లేచిపోతుందిటమ్మా ?

రాజమ్మ—ఏడుస్తున్న దాన్ని నవ్విస్తావు నువ్వు. పైగా, మేన కోడల్ని నువ్వేమన్నా అనతగ్గవాడవే.

దీక్షితులు—ఇంతకీ, వారుకూడా అంగీకరించి బయలుదేరాలి కదా ?

రాజమ్మ—మా వదిన పెంకిమనిషి కాదు, వస్తుందయ్యా ! కాళ్లమీద పడి నేను బతిమాలుకుంటాను కాదూ ? ఆతిమ్మా యేర్పాట్లన్నీ నువ్వు చేస్తూ తొరగానూ.

దీక్షితులు—జానకమ్మ పెంకిమనిషి కాదు నిజమే; కాని మరి జోగన్న మాట ? అన్నకాడి కంతా యిచ్చేయ్యకుండా—

రాజమ్మ—ఇంకెందుకూ ? యకరంనర భూమీ, మూడు వందల నలభై యెనిమిది రూపాయీలూ, వాటి కయిన వడ్డీ—

దీక్షితులు—అదిగదీ మాట. సెబాస్ !

రాజమ్మ—మంచీ చెడ్డా అందమూ చందమూ నాకు తెలియ వనుకున్నా వేమిటయ్యా ?

దీక్షితులు—నీ మాట కాదమ్మా, అంతా సిద్ధం అయినాక మీ నాన్న—

రాజమ్మ—ఊరికే పేరుమట్టుకే నయ్యా మానాయన !

దీక్షితులు—అయితే, అదంతా నువ్వే చేస్త ?

రాజమ్మ—దెప్పుతావా అన్నయ్యా ?

దీక్షితులు—లేదమ్మా లేదు, వూరికే తెలుసుకోడానికి, అంతే.

రాజమ్మ—అదంతా తరవాత చెబుతా కాదూ ? ఇదిగో నేను వెళ్లి మా వదిన్ని బతిమాలుకుంటున్నాను, మీ బావతో చెప్పి నువ్వు ప్రయాణం సిద్ధంచేయించు. పాలికాపుని రాయవరం పంపి జట్కాలు తెప్పించ మను ముందు.

దీక్షితులు—నుంచున్న పాళంగా యింత యెత్తెత్తితే డబ్బు తేగలనా అంటా దేమో బావ ?

రాజమ్మ—ఒకప్పుడు తెచ్చారా యేమిటి మీ బావ ? పది వేలు కావా లంటే గుమ్మరిస్తా నీక్షణంలో. కాకపోయినా, నిన్న రాత్రే వొక రైతు రెండు వేల రూపాయిాల శిస్తు చేతిలో పోసి వెళ్లాడు, అదంతా ఖర్చుపెట్టేస్తా నిప్పుడు. వెళ్లేది చెన్నా పట్నం కనక, అక్కడ మద్దినసు వస్తువులూ దొరుకుతాయి, యెంచక్క.

దీక్షితులు—(మొగం పక్కకి తిప్పుకుంటాడు)

రాజమ్మ—నవ్వు వస్తోందా అన్నయ్యా ?

దీక్షితులు—లేదమ్మా లేదు.

రాజమ్మ—నవ్వితే నవ్వావు గాని, ఇదంతా చేసిపెడితివా మళ్లీ జన్మలో నీ కడుపున పుడతాను నేను.

దీక్షితులు—ఇప్పుడు మాత్రం నాకు తక్కువదానవా నువ్వు?

రాజమ్మ—అదంతా తరవాత మాట్లాడుకుందాం. పండుగు పేరుచెప్పి రావడంవల్ల, సమయానికి, మా పిల్లలూ వారి పిల్లలూ కూడా యిక్కడే వున్నారు, కంగారు అక్కర్లేకుండా. ఇదిగో, సుందరమ్మ వదిన్నీ పిల్లలనూ కూడా తీసుకురాకపోతే నే నొప్పుకోను సుమా !

దీక్షితులు—(మొగం పక్కకి తిప్పుకుంటాడు)

రాజమ్మ—మాట్లాడ వేమయ్యా ? తీసుకువస్తా నను.

దీక్షితులు—నీది వెర్రీ కాదు, వేషమూ కాదు.

రాజమ్మ—ఏమో అదంతా నాకు తెలియదు సుమా !

దీక్షితులు—అది తెలియకపోతే, ఇప్పుడు నువ్వు వేసే పథకాని కెంత ఖర్చవుతుందో తెలుసా ?

రాజమ్మ—సమయం వస్తే ఖర్చుకి వెనక్కి తీస్తానుటయ్యా నేనూ ? ఇంతకీ, వుభయఖర్చులూ నేనే పెట్టుకుంటాను తెలుసా ?

దీక్షితులు—అయితే మాత్రం, వాళ్ళెందు కమ్మా యిప్పుడు?

రాజమ్మ—మాచెల్లెలు కుటుంబం వస్తుంది. మా తమ్ముడి కుటుంబం వస్తుంది. మా మరిది కుటుంబం వస్తుంది. నువ్వు వస్తావు, ఇక మా వదినా, యిద్దరు చంటిపిల్లలూనా నాకు భారం ?

దీక్షితులు—(ఆశ్చర్యం నటిస్తూ) ఇన్ని కుటుంబాలూ బయలుదేరవలసిందే యిప్పుడూ ?

రాజమ్మ—పెళ్లి ముచ్చటూ, శోభనపుముచ్చట్లూ వొక్క మాటే తీరాలి కాదుటయ్యా మరీ ?

౧౯౩౮ మార్చి ప్రబుద్ధాంధ్రనుంచి,
(మార్పులతోనూ కూర్పులతోనూ)

౧౯౪౫—౧—౭వ తేదీని, రాత్రి ౮ మొదలు
౮—30 నిమిషాల దాకా మద్రాసు రేడియోలో
ప్రసారం చేసినది.

---

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి రూపికలు

# కొనుక్కున్న మొగుడు

స్థలం:—నదురుబాదా గ్రామంలో, సూరావధాని యింటో
వంటింటి వసారా.

సమయం:—మధ్యాహ్నం రెండు గంటల వేళ

గున్నమ్మ—అవధాని భార్య పదహారేళ్ల పిల్ల.

సుబ్బమ్మ—అవధాని తల్లి. అరవై యేళ్లవితంతువు. వొత్తుల
బుట్ట ముందుంచుకుని సుబ్బమ్మా, హార్మోనియం
ముందుంచుకుని గున్నమ్మా కూచుని వుంటారు.

వీధి అరుగుమీద కూచుని అవధాని వల్లించు
కుంటున్న ఆశీర్వచనం పనసలు అక్కడికి వినిపిస్తూ
వుంటాయి.

సుబ్బమ్మ—నాకు తెలియక అడుగుతాను గానీ, సంగీతం
అంటే, నాటకాల్లో పాడతారుటా, అదేనా ?

గున్నమ్మ—అయ్యో, అదేం సంగీతమండీ అత్తయ్యా ?
అది వినడానికి మీకే కాదు, నాకూ అసహ్యంగానే వుంటుంది.
నేను నేర్చుకున్నవి త్యాగరాజు కృతులు. అవి పాడుకున్నా
విన్నా ఆనందం అలా వుండగా, భక్తీ జ్ఞానమూ కూడా కలుగు
తాయండీ అత్తయ్యా !

సుబ్బమ్మ—ఏదీ, అవెలా వుంటాయో వొక్కటి పాడమ్మా
వింటాను.

గున్నమ్మ—(శ్రుతి సవరించుకుంటుంది)

సుబ్బమ్మ—బుర్రు మంటూ ఆ పెట్టెందుకూ పాటకీ ?

గున్నమ్మ—ఇది శ్రుతి. శ్రుతి లేకపోతే పాట వెలితిగా వుంటుందండీ !

సుబ్బమ్మ—మా చెల్లెలి కూతురిది లేకుండానే పాడుతుం దెన్నో పాటలు, కమ్మగా.

గున్నమ్మ—వదిన పాట నేనూ విన్నాను. ఆవిడ సంగీతమే నేర్చుకుంటే ఎంతో బాగుండును. శ్రుతి వేసుకుంటూ పాడితే ఆ గాలిపాట అయినా మరీ బాగుంటుంది.

సుబ్బమ్మ—అదేమిటో నాకు తెలియదు సుమా! ఉప్పు లేకపోతే పప్పు బాగుండదు. పులుపు లేకపోతే ధప్పళం రుచిగా వుండదు. కారం లేకపోతే కూర నోటికి పోదు ఇంతే నాకు తెలిసింది చిన్నప్పణ్ణుంచీ.

గున్నమ్మ—నేను వంటచేస్తే మీకు పనికిరాదు; గాని రుచిగా వండడం మా అమ్మ నాకూ నేర్పిందిగా ? కాకపోయినా, శ్రుతి లేని పాటా, మతిలేని మాటా అని సామెత కదా వినలేదూ మీరూ ?

సుబ్బమ్మ—విన్నానే అనుకో. లక్ష వింటున్నాం, అన్నీ తెలిశాయూ ? తెలిసిన వయినా అన్నీ చెయ్యగలుగుతున్నామా ? దానికేం గానీ, యేదీ వొక్క పాట కానిద్దూ తొరగాను.

గున్నమ్మ శ్రుతివేసుకుని "రఘునాయకా" అన్న హంసధ్వని కీర్తన యెత్తుకుంటుంది. పల్లవి పూర్తి అయేటప్పటికి గావుకేకలు పెట్టుకుంటూ అవధాని

అవధాని—ఇదేం సానికొంపా సంసారి కొంపా? వీధి అరుగు మీద కూచుని నేను వేదం వల్లించుకోడమూ, యింటో మేజువాణీనా? నువ్వూ దగ్గిర వుండే చేయిస్తున్నావూ యిదంతా, అమ్మా?

సుబ్బమ్మ—అది నిక్షేపంవంటి పాట పాడూతూ వుంటే అదే మిట్రా నాయనా అలా అంటావూ? రా, కూచో, నువ్వూ పొంగిపోతావు వింటే.

అవధాని—నేనూ పొంగిపోతానూ?

సుబ్బమ్మ—చిలకలా పాడుతోంది, యేమీ పొంగిపోవా? ఇలాంటి పెళ్లాం నీకు తప్ప మరెవరికి దొరికిందీ యీవూళ్లో?

అవధాని—చీ, ఛా రాంబండా? పార్వతీశ్వర శాస్త్రిలుగారి భార్య అనవలసిన మాటలేనా యివి? పనికిరాదు, చేతకాకపోతే నువ్వూ చూస్తూ వూరుకో యీపాటికి. ఇదిగో, వోయి మొద్దూ! నీకే చెప్పడం ఇక నువ్వూ నీ పుట్టింటి పద్ధతులు కట్టిపెట్టాలి. వేదనాదంతో పరమపవిత్ర మైన దివ్యస్థలం గాని, యిది, కన్న కూతుళ్ల నమ్ముకునే కసాయికొట్టు కాదు, తెలుసా? పారెయ్, అవతల పారెయ్ ఆపాడు పెట్టి.

గున్నమ్మ—(విచారంగా) చూశారా అత్తయ్యా?

సుబ్బమ్మ—వోరేయ్, నువ్వూ అవతలికి వెళ్లిపో ముందు. నేను పాడమన్నాను అది పాడింది, నీ ప్రేక్ష్యం లే దిక్కడ.

అవధాని—నా ప్రేక్ష్యం లేదేం? అబ్బో!

అవధాని హార్మోనియం తన్నేస్తాడు. దూరాన వెగిరిపడి అది చెడిపోతుంది.

గున్నమ్మ—అయ్యో, అయ్యో, య్యాభై రూపాయిల హార్మోనియం—మెచ్చి దొరసాని యిచ్చిన బహుమతీ (ఏడుస్తూ) ముక్కా—చెక్కా అయిపోయిం దండీ అత్తయ్యా!

అవధాని—రమ్మను, ఇప్పు డెవరి ప్రేక్ష్యం వుందో చూస్తాను.

సుబ్బమ్మ—వోరి చేవలవాజమ్మా, నువ్వు సంసారివే?

అవధాని—సంసారి ట సంసారి! మాటకి మాట అనేస్తే సరి పోతుం దనుకున్నావు పాపం! అయితే, దాని పెట్టిలో యెలాంటి వస్తువు లున్నాయో నువ్వెరుగుదువా?

సుబ్బమ్మ—నిన్న సాయంత్రమే వచ్చింది తోలిమాటు. అప్పుడే తెలిసిపోయింది పాపం, దాని సంగతి నీకు. కాకపోయినా, దాని పెట్టి ముట్టుకోడానికి నీకేం అధికారం వుందీ?

అవధాని—అబ్బో, అధికారం దాకా వెళుతున్నావు, ఇదిగో చూపిస్తాను, రిమ్మను యెవ డడ్డు వస్తాడో? (గదిలోకి బయలు దేరతాడు)

సుబ్బమ్మ—వోరేయ్, నువ్విప్పుడు గదిలోకి వెళ్లడానికి వల్ల కాదు, ఆగుతావా ఆగవా?

గున్నమ్మ—అయ్యో, లోపల తలుపు గొళ్లె పెట్టేసుకున్నా రండీ! ఇక నా పెట్టి నాకు తక్క-దండీ, అత్తయ్యా, అత్తయ్యా!

(లోపల సీసాలు బద్దలాసిపోయినట్టూ, కాగి తాలు చిరిగినట్టూ, కలం విరిగిపోయినట్టూ చప్పుడు)

గున్నమ్మ—రామా, రామా, నా బతు కంతా బగ్గంపాడయి పోయిం దండీ అత్తయ్యా! సెంటుబుడ్లు, తలనూనెలు, నవలలు, ఫౌంటెన్‌కలం, —నా పెట్టి అంతా బుగ్గి అయిపోయిందండీ!

పరికిణీలు కూడా చింపేస్తారేమో నండీ! అత్తయ్యా, అత్తయ్యా—(కాళ్లు పట్టుకుంటుంది)

సుబ్బమ్మ—దెయ్యం పట్టినట్టుం దివాళ వీడికి, నవ్వు నాకాళ్లు పట్టుకుంటే నేనేం చేతునే తల్లీ!

అవధాని—(ఇవతలికి వచ్చి) నా కధికారం లేదు కాదూ? హు, హు. చీల్చేస్తాను మళ్లీ మాట్లాడా వంటే. వో—హో! అధికారం ట అధికారం. సెంటు కాదు, కిరసనాయిలు పులుము కోమ నింక. నీకూడా బుద్ధి లేకపోయింది గానీ—వాళ్లకీ వాళ్లకీ వుత్తరాలు రాయడాని క్కాకపోతే కలం యెందుకూ సంసారి ఆడదానికీ?

సుబ్బమ్మ—నోరు మూసుకుంటావా లేదా యిప్పటి కయినా? ఎంత అప్రాచ్యుడవు పుట్టావురా నా కడుపున? నే నెంత పాపం చేసుకున్నానురా? నిక్షేపంవంటి పిల్ల దాన్నేడిపిస్తే నీకు జయం కలుగుతుందిట్రా? ఈసంగతి నలుగురికీ తెలిస్తే వీధిలోకి వెళ్లి తల యెత్తుకు తిరగ్గలనా నే నింక?

అవధాని—మరి నేను? షోడశకర్మలూ తుణ్ణాంగా తెలిసిన అవధానులుగారి భార్యకి పరికిణీ వల్లెవాటూనా? తీసెయ్, గువ్వకన్ను కోకలు కట్టించి పాటికి మడిచ్చా పోసి. జడ పనికి రాదు, కొప్పు పెట్టించు. చేతి గాజులు బద్దలుకొట్టెయ్, నిమిషంలో రాగిపట్టీలు చేయించేస్తాను. రెండు పూట్లా వంటలో పెట్టు. బాదంఆకులు విస్తళ్లు కట్టడం అలవాటుచెయ్యి. వొళ్లు పొగరెక్కుతుంది చద్దన్నం అలవాటు తగ్గించెయ్యి, పసిముసిపిని మాన్పించి అంట్లూ చెంబులూ తోమించు. పడ్డన్ని నీళ్లూ చెరువునుంచి దానిచేత మోయించు, నువ్వింటో కూచుని.

గున్నమ్మ—అయ్యో, అయ్యో, ఎలాగండీ అత్తయ్యా ?

సుబ్బమ్మ—ఛీ, ఛీ, సిగ్గులేని నాగమ్మా! ఎక్కడ నేర్చుకున్నావురా యిదంతా? నిండింటో కూచుని చేసుకున్న పెళ్లాన్ని—

అవధాని—హోసోస్, చేసుకున్న పెళ్లాముట, చేసుకున్న పెళ్లాం! అయిదు వందల కమ్మాడు దానబ్బ నాకు. అక్కడ వడ్డీ పెరుగుతోంది, యిక్కడ సంప్రదాయం యిలా వెలిగిపోతోంది. పశువుకీ దీనికీ భేదం యేమిటీ? చూడు, ఎలా చూస్తోందో విషపుచూపులు! ఇంకా చాలింది కాదేం, ప్రాయశ్చిత్తం? (తన్నడానికి కాలెత్తి దించేస్తాడు)

గున్నమ్మ—ఏం, యెత్తిన కాలు మళ్లీ దించేశారేం? తన్నండి మీ కడ్డేం? చంపెయ్యండి నన్ను మీ పుణ్యం పండుతుంది.

సుబ్బమ్మ—హోరేయ్, దాన్ని కాదు తన్నడం నన్ను. దానబ్బదా న్నయిదు వందల కమ్మాడు, నేను నీవంటి శుద్ధపశువుని కన్నాను. పిల్లని కొనుక్కుంటే కాని పెళ్లి కాని దద్దమ్మవు, గంతులు వేస్తావేం యింకా? ఛిఛీ, అభాగ్యుడా! ఛండాలుడు నయంరా నీకంటేను.

అవధాని—ఇక పురాణం కట్టిపెట్టు. ఇదిగో, నే నిప్పుడు రామచంద్రపురం వెడుతున్నాను. రాత్రికి నే నింటికి వచ్చాటప్పటికి వేషం మారకపోతే, దాని వొంటిమీద ములకాటికర్ర విరుగుతుంది, ఇదే చెప్పడం.

సుబ్బమ్మ—దాని వొంటిమీద దెబ్బ పడితే ను వ్వేమయి పోతావో తెలుసా ? నోరు మూసుకో యీపాటికి, నీభావమరిది పోలీసుఇనస్పెక్టరు. వొళ్లు తెలిసిమసులుకో

అవధాని—పోలీసు కాదు, గీలీసు. ఏంచెయ్యగలడు నన్ను ? ఆమహానుభావుణ్ణి నాగుమ్మంలో అడుగుపెట్టనియ్య చెబుతాను. (వెళ్లిపోతాడు)

సుబ్బమ్మ—ఊరుకో తల్లీ, వూరుకో నేనూ దీని కంతకీ కారణం. నీది కాదు దౌర్భాగ్యం, నాది. రాకుసుణ్ణి కన్నాను నేను. నీ మామగారి తప స్సంతా యిలా ఫలించింది యేమి చెప్పుకోనూ ? లే అమ్మా, లే, ఇంటోకి పద. పెట్టె అంతా చిందరవందరచేసి పారేశాడు సద్దుకోవమ్మా !

గున్నమ్మ—ఇంకేం సద్దుకోను అత్తయ్యా ? చూశారా, చూశారా ! పదిరూపాయిాల బీరువారీ అద్దం బద్దలాడిపోయిం దోయ్ తండ్రీ ! రామా, రామా !

సుబ్బమ్మ—అయ్యో, అయ్యో, పక్క— అంతా సిరా, గోడ లన్నీ సిరా—వీడి మొగం యీడ్వా, వీడెలా బతుకుతా డమ్మా యింకా ?

౨

స్థలం:—అవధాని యింటో నట్టివాకిలి

సమయం:—సాయంత్రం అయిదు గంటలవేళ.

సుబ్బమ్మా, గున్నమ్మా వొకచోటా, అవధాని వొకచోటా కూచుని వుంటారు. ఇంతలో గున్నమ్మ అన్న పోలీసు ఇనస్పెక్టరు చలపతిరావు వస్తాడు.

సుబ్బమ్మ—ఇదిగో, చలపతిరావే! గున్నా, మీ అన్నయ్యకి కాళ్లు కడుక్కోడానికి నీళ్లియ్యి తల్లీ!

చలపతి—ఏం బావా, కులాసాగా వున్నానా?

అవధాని—(వెటకారంగా) కులాసా కాక? మనకా లోటు? హే! హే!

గున్నమ్మ—కాళ్లు కడుక్కో అన్నయ్యా, చెల్లాయి పెళ్లి యెన్నాళ్లుందీ?

చలపతి—చెం బలా వుంచు. మళ్లీ బుధవారంనాడే సమ్మా ముహూర్తం.

సుబ్బమ్మ—సంబంధం యేవూరు చలపతీ? అయ్యో, నా తెలివి తెల్లవారా, నువ్వంటున్నా నేమిటి పోలీసినశ్మాష్టరు గారిని?

గున్నమ్మ—మా అన్నయ్యవి మీ రేమన్నా తప్పులేదండీ అత్తయ్యా!

చలపతి—మీ రలా అనకం ధర్మ మేనా అత్తగారూ? "వొరే, చలపతీ" అనవలసినవాణ్ణి కదా మీకు నేను?

సుబ్బమ్మ—ఎంత మాట అన్నావు నాయనా? ఇదిగో దాహం పుచ్చుకో ముందు.

చలపతి—గ్లాసు అలా వుంచండి, వొక్క క్షణం వుండి పుచ్చుకుంటాను. వేమూరి జగదీశ్వరరావుగారని కాకినాడలో వొక ప్లీడరుగుమాస్తా ఆయన రెండో కుమారుడు వెంకటరావు స్కూలుఫైనల్లో నెగ్గివున్నాడు. అతని కిస్తున్నాం మా శేషుని.

అవధాని—తగిన వృజ్జీ నోరికింది. మహాబాగా వుంది గాదూ! అయితే, యే మాత్రమోయ్ బేరం?

సుబ్బమ్మ—తప్పు నాయనా, నవ్వ్యారుకో.

చలపతి—నలుగు రన్నదమ్ములు వారు. అయిదుగురు తోడ బుట్టిన పడుచులున్నూ. మీతో చెప్పకేం అత్తగారూ? అయిదు వంపలు కట్నం. వెండిచెంబూ, వెండికంచమూ, పట్టుతాపితాలూ—

అవధాని—అమాయికం ముండావా డొపడూ దొరకలేదూ? సంచిరూపాయిాలు పలుకును గదా?

సుబ్బమ్మ—అబ్బాయీ! ఊరుకోమన్నాను.

చలపతి—రేపు దశమీబుధవారం పెళ్లి. బావా మీరూ దయచెయ్యాలి. మా గున్నని పంపిస్తే తీసుకువెళతా మని కొంచెం ముందుగా వచ్చాను

సుబ్బమ్మ—ఇంతకంటేనా నాయనా! చాలా సంతోషం.

అవధాని—ఎందుకమ్మా అంత సంతోషం? మనమేం అడుక్కుతింటున్నామా? కాకపోయినా, కన్నకూతుళ్ల నమ్ముకునే పెద్దమనిషీ, కొంపలు టాంటాం కొట్టించే పెద్దమనిషీ వియ్యం అందుతున్నారు. శుద్ధవైదీకంలో వున్నవాళ్లం మనం వెడితే ఉభయవర్గాలవారికీ తలవంపులు కాదూ? ఇదిగో నయ్యాయ్, ఇనశ్మాష్టరూ! నాకు దాపరికాలు పనికిరావు. మేము నీగుమ్మంలో అడుగుపెట్టం. నీచెల్లెల్ని పంపించం. ఇందుకోసమే వచ్చివుంటే నువ్విక దయచెయ్యవచ్చు.

సుబ్బమ్మ—ఆ, యేమిటి నాయనా ఆ దురుసుతనం?

చలపతి—అత్తగారూ, గతంగతం—

అవధాని—ఇంకో వారం దినాలు పోతే యిదీ గతంగతమే అయిపోతుంది, చెప్పలేవుటమ్మా ?

చలపతి—అత్తగారూ, అప్పటి పరిస్థితులను బట్టి మా నాయన యేమి చేశాడో చేశాడు.

అవధాని—అబ్బా, మీ నాయన యేమో చేశాడూ ? నీకు తెలియకపోతే నేను చెబుతా విను. ఆ కందారాజుగారు నీ చెల్లెల్ని నా కయిదు వందల కమ్మాడు. కరుకులు గుమ్మరించిన వాణ్ణి నేను.

సుబ్బమ్మ—నాయనా ? నా మాట వినవ్వూ ?

అవధాని—ద్రాక్షారామ సంతలో పశువుని కొనుక్కునేటట్టు కొనుక్కున్నాం మనం రాజమహేంద్రవరం బజార్లో పిల్లని. వారి చుట్టరికం మన కేమి టమ్మా ?

చలపతి—జరిగిపోయినదానికి మా యింటిల్లపాదీ సిగ్గుపడిపోతున్నాం. మరి యిప్పు డేమి చేస్తే నీకు తృప్తి అవుతుందో చెప్పవోయి బావా !

అవధాని—కభుర్లే గాని నేమి చేసి తృప్తిపరచగలవోయి నన్ను నువ్వు? వెతికివెతికి కిరస్తానీ చదువులవాణ్ణి తీసుకువచ్చావు, నా విలవ నువ్వేం కట్టగలవంట ?

చలపతి—మన మెలాగా బంధువులం అయిపోయే వున్నాం. ఇక విలవలు కట్టుకుంటే వచ్చేదీ, తీసిపారేసుకుంటే పోయేదీ యేమి వుందీ ? జరిగిపోయిన పొరబాటు సవరించుకోగల మేమో అని నా ఆశ. నువ్వు చెప్పడాని కేం ?

సుబ్బమ్మ—అత నంత ప్రాధేయపడుతూ వుంటే అడిగింది చెప్పడానికేం నాయనా· నీకు ?

అవధాని—అయితే వినవోయ్ మరి.

సుబ్బమ్మ—తొందర పడకు నాయనా !

అవధాని—మా అమ్మ తొందరపడవద్దంటూంది; గాని నా వొళ్లు మండిపోతోంది, యెవరు కనిపెట్టగలరూ ? కనక, నేను చల్లబడాలంటే మీ నాయన పుచ్చుకొన్న అయిదు వందలూ ముందిక్కడ కక్కమను.

చలపతి—సరే, కక్కుతాం.

అవధాని—కక్కుతావూ ?

చలపతి—కక్కుతాం, సందేహపడకు.

అవధాని—ముందు కక్కిమాట్లాడవోయ్ !

చలపతి—ఇదిగో, మా నాయన నీ దగ్గిర పుచ్చుకున్న అయిదు వందలూ వడ్డీతో సహా తెచ్చాను, పుచ్చుకో. (ఇస్తాడు)

అవధాని—(పుచ్చుకుని) ఇక చిన్న చెల్లెలి పెళ్లికి నీ పెద్ద చెల్లెల్ని తీసుకు వెళ్లవచ్చు, నా అభ్యంతరం లేదు.

చలపతి—నువ్వా అత్తగారూ రాకుండా మా చెల్లెలు వచ్చినంత మాత్రాన మా కేమి సంబరం బావా ?

అవధాని—అయితే, నీ రెండో చెల్లెలి మొగుడికిస్తున్నట్టు నాకున్నూ ఆవరవడినే కట్నమూ లాంఛనాలూ సమర్పించుకో వలసిందే. లేదూ, నువ్వెవరవో మే మెవరమో దయచెయ్యి.

సుబ్బమ్మ—చలపతీ, మా వాడు కొంచెం దురుసుమనిషి. వాడలా కటువుగా మాట్లాడుతున్నందు కేమీ అనుకోకు నాయనా !

చలపతి—అనుకోడాని కేం వుంది అత్తగారూ? బావ చెప్పింది ధర్మంగానే వుంది. ఇక మనకి వెనకటి గొడవలు అవసరం లేదు.

బావా! నువ్వేమన్నా నాకు కోపం లేదు, నీబాధ నీదీ, నాకు తెలుసు. నీకున్నా కట్నమూ కానుకలూ నే నిచ్చుకుంటాను; కాని యిప్పుడు కాదు. అత్తగారూ! మా నాయన వృద్ధు డైనాడు. తిని కూచోడం తప్ప ఆయనవల్ల యింకేమీ కాదు. ఈపెళ్లిభారం అంతా నామీద పడింది. బావా, నన్ను నమ్మవయ్యా! నువ్వూ మీ అమ్మాకూడా రండి. నువ్వు రాకపోతే మాకే కాదు, మా గున్నకీ వుత్సాహంగా వుండదు.

అవధాని—కట్నం పుచ్చుకున్న చెల్లెలి మొగుడు దగ్గిర తన మొగుడు తీసికట్టుగా వుంటే మీ గున్న బాగా వుత్సాహంగా వుంటుంది, కదూ?

చలపతి—నాది పొరపాటే, క్షమించు బావా!

అవధాని—కనక, నే నిన్ని మాటలవాణ్ణి కాను. చెప్పాను కాదూ? నా డబ్బు నా కిచ్చావు, నీ చెల్లెల్ని నువ్వు తీసుకు వెళ్లు. ఇక నా కివ్వవలసింది నా కిచ్చాకే నేను మీయింటో విస్తరి వెయ్యడం, మరి మాట్లాడకు.

సుబ్బమ్మ—నీమామగారికీ చలపతికీ చాలా భేదం వుంది నాయనా, ఆలోచించు. తొందరపడకు.

అవధాని—నేను మాత్రం చూపించలేదు టమ్మా ఆభేదం?

సుబ్బమ్మ—చలపతీ! నా మాట విని యిప్పటికి గున్నని తీసుకువెళ్లు నాయనా!

చలపతి—సరేనండీ అత్తగారూ! కాని నేను మరిచిపోతా ననుకోవద్దు. మా నాయన వెయ్యిన్నూటపదహార్లు పుచ్చుకుని మరీ పెళ్లిచేశాడు నాకు. కనక, యెవరికి జరగవలసిన మర్యా

డలు వారికి జరగవలసిందే. అయితే, మనవిచేశాను కాదూ? కొద్ది మాసాలు—

సుబ్బమ్మ—ఆమాట యిప్పు డెందుకోయ్ ?

అవధాని—ఇంకొక్క మాట. ఇదిగో, బావోయ్ ! పెళ్లి అయిపోగానే మీా చెల్లెల్ని తీసుకువచ్చి యిక్కడ దిగబెట్టే పూచీ నీదీ, తెలుసా ?

చలపతి—తెలుసు, నేనే తీసుకువస్తాను. అయితే, పదహారు దినాల పండుగు వెళ్లేదాకా తొందర పెట్టకు. ఏమంటే? అక్కడా యిక్కడా మనుగుడుపులు కావాలి. నా భార్యా మా గున్నా వెళతారు కాకినాడ.

సుబ్బమ్మ—తొందర పెట్టను నాయనా! ఆ సరదా గున్న కెప్పుడు తీరనూ ?

అవధాని—సర్లే, వొప్పుకున్నాను. కాని బావోయ్ ! ఇక మరో కారణాలు కల్పించి ఆపైని ఆలస్యం చెయ్యడానికి వల్ల కాదు సుమా !

చలపతి—ఎందుకూ ? నేను మాత్రం కూచుంటానా రాజ మహేంద్రవరంలో ? సెలవు కాగానే పనిలో చేరవద్దూ ?

గున్నమ్మ—నే నంటే మా అన్నయ్య ప్రాణం యిస్తా డండీ అత్తయ్యా ! అన్నమాట తప్పడండీ అతను. అయినా మీారూ కూడా వస్తే యెంతయినా సంతోషిస్తా డండీ ! నెత్తిమీాద పెట్టు కుంటా రండీ మావాళ్లు.

సుబ్బమ్మ—నిజమే తల్లీ, నే నెరగనూ ? అయినా, యిప్పటి కిలా పోనియ్యి. బంధువు లెందరో వస్తారు

కదా, మా వాడి కయినా మొగం చెల్లాలా వద్దా నువ్వే చెప్పు పోనీ !

## 3

స్థ :—అవధాని యింటో నడవ.
సమయం:—మధ్యాహ్నం రెండు గంటలవేళ.

సర్కిల్ ఇన్‌స్పెక్టరు వీరాస్వామినాయుడూ, చలపతీ, అవధానీ వొకచోట కూచుని వుంటారు

సుబ్బమ్మా గున్నమ్మా కొంచెం దూరాన నుంచుని వుంటారు.

చలపతి—వీరాస్వామినాయుడుగా రని వీరు రామచంద్రపురంలో సర్కిల్ ఇనస్పెక్ట రండీ అత్తగారూ! జమీందారీ కుటుంబం వీరిది. వీరి తండ్రిగారు, చిన్నప్పట్నుంచీ వీరినీ నన్నూ వొక్క మోస్తరుగా చదివించారు. వారి అనుగ్రహంవల్లనే నేనీస్థితికి వచ్చాను.

గున్నమ్మ—పోలీసువేషంవల్ల పోల్చుకోలేకపోయా నన్నయ్యా! సుభద్రమ్మ వదినగారూ, మేనగోడళ్లూ సుఖంగా వున్నారా నాయుడన్నయ్యా !

వీరాస్వామి—కులాసాగానే వున్నా రమ్మా! సీత తరుచు నువ్వు చెప్పిన పాటలే పాడుకుంటూ వుంటుంది. నెలదినాలయింది నేను రామచంద్రపురం బదిలీ అయి. సర్కారుకి రాసి అన్నయ్యని నేనే రప్పించా నిక్కడికి. నిన్నగాక, మొన్ననే వచ్చి చేరాడితను

గున్నమ్మ—మీరిద్దరూ వొకచోటే వుండడమూ, నాకు దగ్గిరగా వుండడమూ —చాలా సంతోషం అన్నయ్యా! మా సుభద్రమ్మ వదిన నేనంటే ఆడబడుచున న్నట్టు చూసుకుంటూ రండీ అత్తయ్యా!

సుబ్బమ్మ—కాదూ మరీ? అనుగ్రహం వస్తే పెద్ద కుటుంబాలవారి పద్ధతు లలాగే వుంటాయి.

వీరాస్వామి—అత్తగారూ! మా గున్ననిపట్టి నన్ను కూడా మీ బంధుకోటిలో చేర్చుకోండి. మా చలపతి యెలాంటివాడో నేనూ ఆలాంటివాణ్ణే మీకు.

సుబ్బమ్మ—అయ్యో, అధికారులు మీరు, ఎంత మాట నాయనా!

వీరాస్వామి—ఇక మేము వచ్చిన పని, మా చలపతి చిన్నవాడయివుండగా గున్న పెళ్లి అయింది. అయినా, జరిగిపోయిన తప్పు మేము దిద్దుకోవలసిందే. చలపతి యిదివరకే కొంత దిద్దుకున్నాడు. ఇక తరవాయి. ఇవిగో, బావగారికి కట్నమూ లాంఛనాలూను. స్వీకరించండి బావా!

సుబ్బమ్మ—మీకు దయ వుంది కనకా, చలపతి పెద్ద లెక్కల్లో వాడు కనకా మా అబ్బాయికి లోటులేకుండా చేశారు, ముచ్చట్లూ తీర్చారు, గాని యిదేమి నిర్బంధమూ నాయనా? అయినా, మీరే పట్టుకరావాలా? ఏం, అబ్బాయీ పుచ్చుకోవేం?

అవధాని—పుచ్చుకోకేం? నాయుడు బావగారూ! మీ అనుగ్రహమే చాలు, దయచేయించండి.

వీరాస్వామి—కొంచెం ఆలస్యం అయింది డబ్బు కూడబెట్టి ఇది సంపాదించే వొక్క నెల గడిచింది; కాని మా చలపతి యిక్కడికి వచ్చాక యిద్దా మని ఆలస్యం చేశాము. ఏం, కోపం తీరిందా బావగారికి? అనుగ్రహం వచ్చినట్టా?

సుబ్బమ్మ—నా కొడుకు వొట్టి వెర్రిబాగులవాడు నాయనా! వాడి మాటలు మనసులో వుంచుకోకండి.

వీరాస్వామి—అయ్యో, ఇంతా అంతానా బావగారి వెర్రిబాగులతనం? ఏమయినా వొక్క మాట. ఉన్న సంగతి మనవి చేసుకోవద్దూ? బావగారూ, ఇదివరలో మీరు మా చెల్లాయిని కొనుక్కున్నారు. మరి యిప్పుడు? మీ రిప్పుడు మా చెల్లాయి కొనుక్కున్న మొగు డయిపోయి వూరుకున్నారు, అర్థం అయిందా? ఆమె హార్మోనియం బద్దలుకొట్టారు మీరిప్పుడు. సెంటుబుడ్లు, పుస్తకాలు, కలం, సిరాబుడ్డి—వొకటేమిటి సమస్తమూ ధ్వంసంచేశారు. ముసలిముత్తయిదువ వేషం కూడా వేయించారు. మరి, మిమ్మల్నిప్పుడు మా చెల్లాయి యేమి చెయ్యకూడదూ?

సుబ్బమ్మ—నా తండ్రి యింక బుద్ధిగా వుంటాడు నాయనా! ఇప్పటికి క్షమించి వెనకటి దంతా మరిచిపొండి.

వీరాస్వామి—బావగారు చేసినవి క్షమించవలసిన పనులేనా అత్తగారూ? అవి మరిచిపోడం సాధ్యమేనా? మీరు మంచి వారు కనకనూ, కడుపులో పెట్టుకున్నారు కనకనూ బతికి పోయింది గాని—

సుబ్బమ్మ—విన్నవించుకున్నాను కాదూ తండ్రీ? అదంతా కుర్రతనం. ఇక పెద్దతరహా నేర్చుకుంటాడు. మీరు గీసిన గీటు దాటడు సరా?

వీరాస్వామి—అంతకంటే కావలసిం దేమిటి ? అయినా, వొక్కటి మనవిచేసుకుంటాను. మీరు మా కందరికీ పెద్దలు, ఎవరివల్లా లోపాలు రాకుండా చూస్తూనే వుంటారు. బావగారు బుద్ధిగా వుంటారా, నేను వారి భృత్యుణ్ణి. లేదూ, వారి గుండెల్లో నిద్రపోతాను. చలపతి కొక్కడికే కాదు, గున్న నాకూ తోడబుట్టిన పడుచే......తమ్ముడూ ! ఇంకెందుకూ, లే, చాలా పనుంది మనకి.

చలపతి—ఇదిగో లేచాను.

గున్నమ్మ—అదేమిటి నాయ డన్నయ్యా ? మా యింటో భోజనం చెయ్యకుండా వెడతారా ?

వీరాస్వామి—పనికట్టుకువచ్చాను గదా, భోజనం చెయ్య కుండా వెడతానుటమ్మా వెర్రిపిల్లా ? అత్తగారూ ! ఇక్కడే, మాకు వెదురుపాక గ్రామంలో కొంచెం పనుంది, చూసుకుని మళ్లీ దీపాలు పెట్టాటప్పటికి వచ్చి, మీ చేతి ప్రసాదం పుచ్చు కుంటాను.

సుబ్బమ్మ—అంతకంటేనా నాయనా? కాని మేము బీదవాళ్లం. మా బతుకు మీరు వేసుకునే తాంబూలం విలవ లేనిది కదా ?

వీరాస్వామి—బంధుత్వమూ ప్రధానం భాగ్యమూ అత్త గారూ ? తమ్ముడు చాలామాట్లు, చాలాచాలా చెప్పాడు మీ సౌజన్యం. బావగా రయినా కొంచెం అల్లుడుతనం చూపించా రంతే. కనక, యిక భేదభావం మరిచిపొండి. మరి సెలవ్ !

సుబ్బమ్మ—మంచిది, వెళ్లిరండి నాయనా !

చలపతి—చెల్లీ, యీచీటీ వదినకు పంపించు.

గున్నమ్మ—మంచి దన్నయ్యా !

౪

స్థలం:—అవధాని వీధి అరుగు

సమయం:—చలపతి వెళ్లిన అరగంట దాటాక.

అవధాని అరుగుమీద కూచుని వుంటాడు. దూరాన గున్నమ్మ నుంచుని, బెదురుతూ బెదురుతూ లోపలి కొకమాటూ, గంభీరంగా అవధాని కేసి ఒకమాటూ చూస్తూ వుంటుంది.

గున్నమ్మ—(చిటికెలు వేస్తూ) ఇదిగో, యేమండోయ్, యేమి చేస్తున్నారూ ? గోళ్లు గిల్లుకుంటూ అలా కూచోడమేనా, యింటో యేమి వుందో యేమి లేదో, యేమి కావాలో యేమి అక్కర్లేదో చూసుకోడం వుందా ? చాల్చాలు, లేవండీ పాటికి ఆమడ్డితనం యేమిటీ ? ఇదిగో, యీ చీటీ పుచ్చుకుని రామచంద్రపురం వెళ్లాలి మీరు నుంచున్నపాళంగా. మా వదిన హార్మోనియం యిస్తుంది పట్టుకురండి తొరగా. సబ్బుబిళ్లలూ, సెంటుబుడ్లూ, నవలలూ, ఫాంటెక్కలమూ, సిరాబుడ్డీ కూడా యిస్తుంది పట్టుకురావాలి. రిబ్బన్లూ, ఫేసుపౌడరు డబ్బా, సో్ఒ, బర్మాముడిసూదులూ కూడా నే నిమ్మన్నానంటే యిస్తుంది పట్టుకురండి. అల్లుకోడానికి వ్రూలూ, కుట్టుకోడానికి రంగుదారాలూ, సూదులూ కూడా పట్టుకురావాలి. సంవత్సరం అయింది కాఫీమొగం చూసి, పీసెడు కాఫీగింజలూ,

పౌను టీడబ్బా, ఎత్తెడు పంచదారా, వీసెడు బంగాళా దుంపలూ, పదలం నీరుల్లిపాయలూ, ఏబులం పచ్చిమిర్చి,— ఇవన్నీ తేడానికి కూలిమనిషి అక్కర్లేదు, మీరు పట్టుకురావచ్చు, మనం చేసేది అంతకంటే యేమీ లేదు తెలుసా ? ఎన్నాళ్ల నుంచో నోరు చచ్చిపోయి వుంది, పంపు ఉల్లిపాయపకోడీ— మన కిద్దరికీ చాలు, పదలం మిఠాయీ—తొక్కుడుమిఠాయి సుమండీ, కావా లని చెప్పండి. అన్నట్టు, అలారం టైంపీసు లేకపోతే యెలాగా వేగడం యీ పల్లెటూళ్లో ? అరడజను పరికిణీగుడ్డలూ, వాటికి తగిన జాకెట్టుగుడ్డలూ, పలెవాటుకిండు వాలూ కూడా యిస్తుంది మా వదిన ముందు మీరు పట్టుకు రండి, నాలుగు దినాలలో నే నోమాటు వెళ్లి కుట్టించుకు వస్తాను. వెళ్లేటప్పుడు గాజుల మల్లయ్యని యింటికి పంపి మరీ వెళ్లాలి సుమండీ ! ఇందులో యేది మరిచిపోయినా, వచ్చిన వెంటనే మళ్లీ పంపిస్తా నేమనుకున్నారో ? ఒక్క మోద కవటాకులూ, పదలం పోకలూ జాజికాయలూ, జాపత్రీ, ఏలక్కాయలూ, లవంగాలూ, కవిరీ—తెలుసా ? పట్టుకురావాలి. హరికేన్ లాంత రొక టయినా పంప మని చెప్పండి, బుడ్డిదీపంతో బాధపడలేకుండా వున్నాను. అన్నట్టు, మా వదిన తీసుకువెళ్లినా మీరు మా నాయుడన్నయ్యగారి యింటికి వెళ్లవద్దుసుమండీ ! మీ పిలక చూస్తే వారి పిల్లలు డొక్కుంటారు. మావదినగారి యెకసక్కాలు నేను భరించలేను. పదిహేను దినాలలో నేను మళ్లీ రామచంద్రపురం వెడతాను, అప్పుడు నా వెనకాల వస్తురుగాని మీరు, చక్కగా క్రాపింగు దువ్వుకునీ, షర్టూ

కోటూ తోడుక్కునీసి. ముందు, ఆ గౌడుంకాయ యివ్వండి బద్దలుకొట్టేస్తాను. లేవండి, తెల్లమొగం వేసుకు చూంటే కాదు, నిమిషంలో వెళ్లాలి చిటికె వేశాటప్పటికి రావా లేకపోతే బాగా జరగ దేమనుకున్నారో ? మా వదిన అయినా యిస్తే కిక్కురుమనకుండా పుచ్చుకోవాలి, లేకపోతే ఊఁ, తెలిసిందా ? ఆ, యిప్పుడు జ్ఞాపకం వచ్చింది, మంచిరకం పింగాణీకప్పులూ సాసర్లూ—మీ కొకటీ నా కొకటీ—రెండు జతలు కావా లని చెబితే మావదిన యిస్తుంది పట్టుకురండి. గోధుమనూకా అల్లంకొమ్ములూ కూడా పట్టుకురండి, రేపు పొద్దున్న మా అన్నయ్యలకీ మనకీ ఉప్మా చేసుకోవద్దా ? లేవండి లేవండి మా అన్నయ్యలు వచ్చాటప్పటికి మీ రింటో వుండాలి.

సుబ్బమ్మ—(మెల్లిగా వచ్చి) అమాయకుడు తల్లీ, నాతం డ్రిని కంగారుపెట్టకే

గున్నమ్మ—లేదండీ అత్తయ్యా ! (గునుస్తూ) వొకమాటు రామచంద్రపురం వెళ్లి రమ్మంటున్నా, నంతే నండీ !

౧౯౪౮ ఆగష్టు ఆంధ్రశిల్పి.

ఇది ౧౯౩౪ జనవరి ప్రబుద్ధాంధ్రలోవున్న
కన్యాశుల్కం—వరశుల్కం" అనే నాకథకు రూపిక.
౧౯౪౮ జూన్ ౩౦ తేదీ రాత్రి ౯—౧౫ లకు
మదరాసు రేడియోలో ఆడిన క్లుప్తరూపాని కిది
స్వస్వరూపం.